# విషయసూచిక

## గ్రంథకర్తృప్రశంసాదులు.

---

1. యథావాల్మీకము:—దీనికవి ఘనగిరి రామకవి ఇతనితండ్రి అహోబలుఁడు. తాత వేంకటగిరిభట్టు. భారద్వాజసగోత్రము.

గద్యము:—ఇది శ్రీ రామచంద్ర చరణారవింద ద్వంద్వకందళితస్యందమాన సాంద్రతరధారాసారమకరందరసపూరాస్వాదనతుందిలాయమానమానసేందిందిర నిరుపమకవితాధురంధర భారద్వాజసగోత్రపవిత్ర విమలాపస్తంబసత్సూత్ర ఘనగిరి వేంకటగిరిభట్టపౌత్ర అహోబలసూరిపుత్ర సకల బుధసుకవినికరారాధనకరణ విలసచ్ఛవి రామకవి ప్రణీతంబైన యథావాల్మీకం బనునాంధ్రరామాయణంబున......కాండము......అధ్యాయము.*

ఈతఁడు శ్రీమద్వాల్మీకిరామాయణమును, కాండములు, అధ్యాయములును యథావిధముగానేయుంచి రచియించినాఁడు. మనకథ యందలి యారణ్యకాండమున ముప్పదియొక్కటవ యధ్యాయము. (ఏకత్రింశోధ్యాయము) అన్నికాండములును గనఁబడవు. ఈకాండమును సంపూర్ణముగా లేదు. శిథిలస్థితిలో నున్నది. ఇతనికాలమును దెలిసికొనుటకుఁ గాని నివాసము నెఱుఁగుటకుఁ గాని

మొదటిభాగము దొరకనికారణమున వలనుపడుటలేదు. గద్యనుబట్టి యితఁ డహోబిలసమీపమువాఁ డనుకొనవచ్చును. ఈతనియాంధ్రీకరణమును గవితాశైలియు నీపద్యములంబట్టి విజ్ఞు లూహింపవచ్చును.

---

2. కులశేఖరమహీపాలచరిత్రము:—దీనికవి శేషము రఘునాథాచార్యులు. కులశేఖరాళ్వారులచరిత్రమే యాంధ్రగీర్వాణమిశ్రప్రబంధముగా రచియింపఁబడినది. కవి

సీ. శుభకరాపస్తంబసూత్రుండు కౌండిన్య
గోత్రపవిత్రుండు గుణవిశిష్టుఁ
డనుపమశేషాన్వయాంభోధిచంద్రుఁ డ
హోబలదేశికుఁ డొనరఁ దనదు
సతియందుఁ బుత్రపంచకము నాపాదించె
నందగ్రజుండు రామానుజార్యుఁ
డమ్మహాత్ముండు సీతమ యనునిజదేవి
వలన శ్రీభట్టరాహ్వయకుమారుఁ
గనియె నాశాంతనిధికి రాగమయు సత్య
భామయును భార్య లిరువురు భవ్యమతులు
పరవి రాగమదేవికి సంభవించె
సరసగుణశాలి వేంకటాచార్యమౌళి.

గీ. అమ్మహాత్ముఁడు లక్ష్మమయనెడుపత్ని
వలన మువ్వురుతనయుల నెలమిఁ గాంచెఁ
జెలిమి రామానుజార్యుఁడు చెన్నభట్ట
రనుసహోదరు లిరువు రే నగ్రజుండ.

క. ఇల రఘునాథార్యుం డన వెలసితి లక్ష్మణమునీంద్ర విమలపదాబ్జం, బులు శరణం బని నమ్మితి......ఇత్యాది యిక్క_వివంశాదికము. కవిత్వము నిర్దుష్టము మనోహరము నైనది.

గద్యము-ఇది శ్రీరామచంద్రకరుణానిరీక్షణసమాసాదిత కవితావిశేష శేషాన్వయప్రదీప వేంకటాచార్యతనయ రఘునాథాచార్యప్రణీతం బైన కులశేఖరమహీపాల చరిత్రంబునందు—

---

3. జయవిజయాభ్యుదయము:—ఈ గ్రంథము ఆర్వేలవంశసంభవుం డగుసుబ్బరాయకవి రచించెను. ఇతఁడు తనగ్రంథమును తిరుపతివేంకటేశ్వరస్వామి కంకితము చేసెను.

"మహాకవిజనానుగ్రహంబున జయవిజయాభ్యుదయం బనుప్రబంధంబు నతిమధురసంస్కృతాంధ్రభాషల రచియింపఁబూని మదీయవంశక్రమం బభివర్ణించెద.

సీ. శ్రీరమ్య మైనయార్వేలవంశాంభోధి
రాకాసుధాంశుఁడై రహిఁజెలంగి
పావనం బగుతుంగభద్రానదీతీర
భాసురరాజవోల్పట్టణాఖ్యఁ
దైపొగడందెను హనుమంతయామాత్యుఁ
డతనినందనులు ప్రఖ్యాతయశులు
తిమ్మప్రధానుండు తిమ్మరసయ్య చె
న్నప్ప యనంగ ఘనాతిదాన
మహితు లమ్మువ్వురందు దుర్మదవిరోధి
గజమృగేంద్రుండు తిమ్మరుస్సఘనుఁడు గనియె
సుతుల నార్గుర నందు ధీయుతుఁడు ముద్దు
లచ్చనాఖ్యుండు వెలసె నిలాస్థలమున.

మ. ధరణిం బెంపువహించునాఘనునకుద్యత్కీర్తిజన్మించెనా
శరధిం గౌస్తుభరత్నముంబలె లసచ్ఛౌర్యుండు దీనావన
స్థిరసత్యోజ్జ్వలమానసాబ్జుఁడగుసుస్నేహాచలామాత్యుఁ డా
శరజిద్వాహనకంధరాబ్జధరభాస్వత్కీర్తిధారేయుఁ డై.

క. ఘనుఁ డతఁడు గాంచె నేగురు
తనయుల హరిచరణభజనతత్పరుల సుధీ
జనహితుల ధర్మనిరతులఁ
గనదురువిద్యావిలాసకౌశలుల మమున్.

క. ఆరీతిన్ జనియించి య
పారలసత్సంస్కృతాంధ్రభాషాసామ్రా
జ్యారూఢి సరసకవితా
ప్రారంభుఁడ నైతి సుబ్బరాయాహ్వయుఁడన్.

అని చెప్పఁబడియున్నది. ఈసుబ్బరాయఁడు చిత్రాంగదాపరిణయము, గరుడాంజనేయవాగ్వాదకథ, ద్విపదసుదంతావివాహము, కృష్ణార్జునసంవాదము నను గ్రంథములను రచించినట్లు చెప్పుకొన్నాఁడు. ఈతఁడు రాజవోలుపట్టణమువాఁ డగుటచే రాజవోలు సుబ్బరాయకవి యనియు నందురు. ఈగ్రంథముయొక్క కథ చిత్రకల్పనలతో గూర్చెను.

మ. ఘనుఁ డాపింగళిసూరనాఖ్యకవిలోకశ్రేష్ఠుఁ డెంతో రహి
న్మనుజెప్పెన్విదితాంధ్రభాషనుగళాపూర్ణోదయగ్రంథము
న్వనవీథిన్ గజబృందముల్ చనిన త్రోవంజీమలిచ్చారతిం
జనవే తద్గతి నేనొనర్తుఁ గృతి శేషాద్రీశుకారుణ్యతన్.

అని కళాపూర్ణోదయకథవలెఁ జిత్రకథ రచించెద నని చెప్పుకొన్నాఁడు. ఈగ్రంథ మాఱాశ్వాసములు గలది. మనకథ మొదటి యాశ్వాసములోనిది. మఱియుఁ బ్రారంభకథయు-విష్ణుచక్రపురము రాజయిన వసుమంతుఁడు సుతులకై చింతించి వనమున కేగి యొక్క మునిదయచే

జయవిజయులను నిరువురుసుతులం గనియెను. ఈయిరువు రు రాజకుమారులె కథానాయకులు.

గద్యము-ఇది శ్రీమద్వేంకటరమణకరుణాకటాక్షలబ్ధనరససాహిత్యకవితావిలాససకలసుకవినికరచరణసేవాధురీణ యార్వేలవంశక్షీరపారావారరాకాసుధాకర భాసురోల్లాస రాజవోల్పురవరనివాస ఆపస్తంబసూత్ర శ్రీవత్ససగోత్రపవిత్ర శేషాచలామాత్యపుత్రసుజనవిధేయ సుబ్బరాయనామధేయ ప్రణీతము.

---

4. కేయూరబాహుచరిత్రము:—ఈగ్రంథమునకు కవి మంచన్న. ఇతఁడు తనవంశాదికము నేమియుఁ జెప్పకొనలేదు. ఇతఁడు రాజమహేంద్రవర నివాసియనియు ౧300 సం॥ క్రీ. శ. ప్రాంతములం దున్నవాఁ డనియుఁ గవులచరిత్రము నిశ్చయించినది. ఈమంచన యీగ్రంథమును నండూరి గుండమంత్రి కంకితముచేసెను. నాలుగాశ్వాసములు గలవు. గుండమంత్రికి మంచన్న యిష్టసఖుఁడఁట. స్నేహితునిచేతఁ దనపై నీకృతిని జెప్పించుకొన్నాఁడు. గుండమంత్రి:

క. తనకిష్టసఖుని విద్వ
జ్జనమాన్యుని నుభయకావ్యసరణిజ్ఞున్ మం

చననామధేయు నన్నుం
గనుఁగొని యి ట్లనియె వినయకౌతుక మెసఁగన్.

౪. స్థాయిరసము శృంగారం
బై యలవడఁ గథలు సీతు లై యెడనెడ రాఁ
గేయూరబాహుచరితము
చేయుము నీవంధ్రవాక్యశిల్పము మెఱయన్.

అని కోరినందునఁ గవి విద్ధసాలభంజిక యను సంస్కృతనాటకకథను దీసికొని యందు నీతికథలుంజొప్పించి రచియించినాఁడు. కవిత్వము రసవంత మైనది.

ఈకవిగద్యము :— "ఇది సకలసుకవిజనవిధేయ మంచననామధేయ ప్రణీతం బైన కేయూరబాహుచరిత్రంబు నందు"....దీనిచేతను గూడ నితనివంశాదిక మేమియుఁ దెలియరాదు. మనపద్యము లిందలిమూఁడవయాశ్వాసము లోనివి.

---

౫. మార్కండేయపురాణము:- కవి మారన. సంస్కృతమార్కండేయపురాణమునకుఁ దెనుఁగు గ్రంథ మిది. ఈమారన ప్రతాపరుద్రుని సేనానాయకుఁ డైననాగయ్యకుమారుఁడు గన్నమంత్రి కీగ్రంథమును గృతి యిచ్చెను. కాఁబట్టి యీకవియుఁ గృతిపతియు, పదుమూఁడవశతాబ్దాంతమునం దున్నవా రని యాంధ్రకవులచరిత్రము

సిద్ధాంతముచేసినది. మారన్న తిక్కనసోమయాజిగారి శిష్యుఁడు. కావుననే కవిత్వము చక్కని యాంధ్రపదముల తో గీర్వాణపదములతో మృదుమధురమై యున్నది. "తిక్కనసోమయాజికవిత్వ మంత మధురముగా నుండదు గాని సలక్షణమైనది గాను మృదువుగాను ఉండు" నని వీరేశలింగముపంతులుగారి యభిప్రాయము.

ఈపురాణములోనుండియే మనుచరిత్రమును, ఋదాలసాచరిత్రమును, దీసి కవులు ప్రబంధములను వ్రాసినారు. ఈహరిశ్చంద్రకథ దీనిమొదటియాశ్వాసములోనిది. నెల్లూరి శంకరకవి హరిశ్చంద్రకథకును దీనికిని గొంత భేద మున్నది. కారణము పురాణాంతరమునుండి శంకరకవి గ్రహించుటయే.

ఈకవిగద్యము :— ఇది శ్రీమదుభయకవిమిత్ర తిక్కనసోమయాజిప్రసాదలబ్ధసరస్వతీపాత్ర తిక్కనామాత్యపుత్ర మారయనామధేయప్రణీతంబైనమార్కండేయ మహాపురాణమునందు—

---

6. విష్ణుమాయానాటకము :- దీనికవి అనంతయ్య. తనవిషయమై కవి యాశ్వాంత్యగద్యములో

"ఇది శ్రీమదనగోపాలవరప్రసాదలబ్ధకవితావిలాస భారద్వాజగోత్రపవిత్ర అయ్యలామాత్యపుత్ర అనంతయ

నామధేయప్రణీతంబైన విష్ణుమాయానాటకంబను మహా ప్రబంధంబునందు*............అని వ్రాసికొన్నాఁడు. ఇంతకు మించి కవివిషయము నేమియుఁ దెలియరాదు. గ్రంథము సమగ్రముగా లేదు. గ్రంథముపేరు నాటక మనియే గాని దృశ్యప్రబంధము గాదు. విష్ణుమాయ లన్నియు నిందుఁ జెప్పఁబడినవి. కృష్ణుని గురు వగుసాందీపునిమనుమఁడొక్కఁడు కృష్ణుని యంతఃపురములోఁ జనవుగా దిరుగుచు, కృష్ణభార్యలయొద్ద ననవరతము వినోదకథలు చెప్పుచు వారిమన్ననలకుఁ బాత్రుఁడై విష్ణుమాయ లన్నియు ననుభవముచే నెఱిఁగి కొన్ని కృష్ణునివలనఁ దెలిసికొని యామహాత్ముని సెలవుపై ధర్మరాజునొద్ద నశేషముని బృందము వినుచుండఁగా వానిని గథలుగాఁ జెప్పుటయే యీపుస్తకములోఁ గవివర్ణించినాఁడు. విష్ణుమాయావిలాసమనుయక్షగానము కంకంటి పాపరాజు రచించెనఁట. ఆ వంశములో నివాఁడొకఁడు విష్ణుమాయావిలాసమును ద్విపదగా రచియించెను. అది పూర్వ మచ్చుపడినది. యిపుడు దొరకుట లేదు.

ఈ గ్రంథ మెవ్వరియొద్ద నైనఁ బూర్ణముగ నుండిన మాకుదయచేసినచో ముద్రించుటకు మేము కుతూహల పడుచున్నాము. ఈయసంపూర్ణప్రతి యాంధ్రసాహిత్య పరిషత్తులోనున్నది. ఈకథ ప్రథమాశ్వాసములోనిది.

ఆర్యపుస్తకాలయము.

రాజమహేంద్రవరము.

శ్రీ

# కావ్యకథావళి

—:o:—

## 1. యథార్థాత్మకము

క. శ్రీరాజీవదళేక్షణ
ఘోరారివినాశకరణ కుధరోద్ధరణా
కారుణ్యరూప (హరి) విభు
ధారాధితచరణ వేంకటాచలరమణా.

గీ. అవధరింపుము కుశలవు లశ్వమేధ
మందు వినిపించినట్టి రామాయణంబు
తెనుఁగు రచియించినాఁడ నర్థిని ఖరాది
ఖలులు దండకయం దట్లు నిలయ మందు.

మ. చరితం బల్ల నకంపనుం డటు జనస్థానంబునం గాంచి స
త్వరమానుం డయిలంక కేగి పలుకుం దద్రావణుం జేరియా
ఖరముఖ్యుల్నిధనంబుఁ జెంది రటసంగ్రామంబునన్నీకుఁ ద
త్సరణిం దెల్పఁగవచ్చితిం గడుమానస్తాపంబునుం జెందుచున్.

చ. అన విని యా దశాస్యుఁడు రయంబునఁ గ్రోధముఁ
జెంది రక్తలో

చనములఁ గ్రక్కుమంటలనసారెకకంపను దగ్ధుఁ జేయునో
జను దగఁ జూచి పల్కె నను జాలవిరుద్ధతనెవ్వఁడెంచె నీ
సునవడిసర్వలోకములుఁజొచ్చినసౌఖ్యములందనేర్చునే 4
ఉ. క్రూరమతిందహింతునతిక్రుద్ధుఁడనై ననువహ్నిసూర్యుల
న్నారసమీరువేగమును సంశమియింపఁగఁ జేయనెంతునే
గౌరవ మొప్ప నన్న దశకంఠున కంజలిచేసి పల్కెవా
చారహిదీనుఁడై భయరసాప్తినిదానభయంబువేఁడుచున్. 5
చ. అభయమొసంగెనంతటదశాననుఁడారజనీచరేంద్రుఁడా
సభను నకంపనుండనుభృశంబు విశృంఖలవృత్తిధారుణిన్
శుభగుణుఁడైన పంక్తిరథసూనుఁడుసింహపరాక్రముండుభూ
విభుఁడు మహామహుండు రఘువీరుఁడు రాముఁడటం
చుదెల్పుచున్ 6
మ. పృథువక్షుండనతుల్యవిక్రముఁడశేషాస్త్రజ్ఞభస్సంధుఁడా
రథికశ్రేష్ఠునియుద్ధి లేఁడతని శౌర్యస్ఫూర్తిచే నొక్కటన్
మథితంబయ్యెనిశాచరౌఘమును వేయేల ఖరుందూషణు
న్వ్యథగావించెఁద్రిశీర్షుతోఁబెలుచనిర్వాణంబుగానవ్వనిన్7
చ. అనిన యకంపనోక్తి విని యారజనీచరనాథుఁడావశా
ననుఁడలనాగరాజనఁగ సంతటనూర్చుచుఁ బల్కెనిర్జరేం
ద్రునిసకలామరాళిఁదనతోడ్పడురాముఁడనంగ నొక్కఁడీ
వనికరుదేరునో తెలుపువాఁడెవఁడన్న నుదగ్రచిత్తుఁడై 8
ఉ. రావణువాక్యములివ్వనికరంబులు మోడ్చియకంపనుండు
ధాత్రీవరుశౌర్యమున్ బలముఁదీవ్రముఁదెల్పెదవిన్ననోదశ

గ్రీవరఘూద్వహుండుపరికింపఁగబల్విలుకాండ్రమేటి యో
దేవవరాస్త్రయోగపటుదీప్తిఁబురందరసామ్యుఁడౌననిన్.

ఉ. వానికి నీడు జోడు బలవంతుఁడు చంద్రనిభాననుండు స
న్మాని కనీయుఁ డాతనికి నారయ లక్ష్మణుఁ డబ్జనేత్రుఁ డా
కానలఁ దత్సహాయతను గా ద్వనలంబును బోలునా జన
స్థానమునీఱు సేసెననుజన్ముఁడుఁదానును రాముఁడక్కటా.

చ. దివిజులు రారు సంగడి యదెంచి విచారముచేయనేల రా
ఘవభుజవేగసృష్టకనకప్రతిచిత్రశరంబు లొక్కటం
గవియుచుఁ బంచశీర్షభుజగాకృతి భక్షణసేయు రాక్షస
ప్రవరులనేదెసం జనినబాయక నిండుచు నిస్తులచ్ఛవిన్.

చ. నిశచరు లాత్తలో వెఱచినేరక యొక్కెడఁ జేర బాఱినన్
దశరథసూతియుగ్మమునుదగ్రతతో నెదురైనమాఱ్కి దాఁ
బ్రశమనఁ జేసె దండక సుభవ్యనికేతననున్నయంతనా
దశవదనుం డకంపనుని దప్పక కన్గొనిపల్కెఁ గ్రోధియై.

ఉ. నేనిదెపో యెద న్వినుమునిక్కము రామునిలక్ష్మణుఙ్ జన
స్థానమునందుఁ ద్రుంతు ననఁదద్దయు జేరియకంపనుండనుం
బూనిక రాము పౌరుషము భూరిపరాక్రమభూతిఁదెల్పనే
మానుమసాధ్యమూపనిక్రమంబునఁ గాకనఁబల్కువశ్యుఁడై

మ. గిరిమంబూర్ణనదీప్రవాహములవేగంబునన్హరించున్నవ
త్వరఁదారాగ్రహపంక్తులొడ్డగిలి ద్రోవల్దప్పఁగాఁ జేయునీ

ధరణింగ్రుంగఁగఁజేయునుద్ధురతమర్త్యం బెల్లనున్వాయుసా
గరవేగంబు హరించు బాణముల లోకంబెల్లనీరైచనన్.

ఉ. లోకము లెల్లగూల్చునువిలోపముచేయునువిక్రమంబునన్
శ్రీకరమూర్తి తామగుడసృష్టియొనర్పఁగనేర్చు శక్తినా
రాకామరున్ జయింపరణరంగమునందు నశక్యమెన్నఁగాఁ
జేకుఱునట్లసౌఖ్యమునుజేయుదుమర్త్యసురాసురాళికిన్.

క. అమరుల కైనను నాతని
సమరంబున గెల్చుటరిది సత్యముగానం
గ్రమమున నొక్కయుపాయము
సముఖంబున విన్నవింతుఁ జతురత విన్నన్. 16

ఉ. వానివధించుమార్గము ధ్రువంబుగఁ దెల్పెదనేకచిత్తతం
బూనివినందగున్నలినృపోత్తముభార్యసుమధ్య సీతనాఁ
జాన నొకర్తుఁ జెప్పనగుఁజంద్రనిభాస్యవధూవతంసయ
మ్మానినికప్సరాంగనలుమర్త్యులుసాటియనంగఁబాడియే

క. దానవ గంధర్వాదుల
మానినులును దివిజభుజగమర్త్యలతాంగుల్
దానికి సమ మనఁ దగునే
జానకి సౌందర్యవతి నిశాచరనాథా. 18

చ. అనఘనృపర్యుభార్యనురయంబుననవ్వనమందువంచనం
గొని యిటుదేరఁగామివనిఁగుందిహతుండగుదానిఁబాసితా

ననవినిరాక్షసేంద్రుడహహాయని మెచ్చుచుబొంగియాయకం
పనుపలుకుల్లనంబునశుభస్థితినూహయొనర్చి యిట్లనున్

ఉ. ఒక్కఁడ నేగెదం బటురయోద్ధతి సారథితోడనిప్పుడే
నక్కమలాక్షిజానకిని హర్షమతిం బురిఁ జేరఁ దెచ్చెదా
నిక్క మటంచుఁదెల్పిరజనీచరుఁడాఖరయుక్తమౌరథం
బెక్కి చనెన్ రవిప్రభనభీక్ష్ణముదిక్కులు తేజమందఁగన్ 20

మ. రహి నక్షత్రపథంబునం జనెడు తద్రక్షోధిపస్యందనం
బహహా భాసిలె మేఘమధ్య శశిబింబాభంబు నై యవ్విధి
న్బహుతీవ్రంబునఁ దాటకేయువనముం బ్రాపించిమారీచుచే
మహిందివ్యార్ఘ్యసపర్యలందనిసెనిమ్మా భక్ష్యభోజ్యంబులన్

శా. మారీచుండును రాక్షసాధిపుని సన్మానించి పూజించిస
త్కారంబుంబొనరించియర్థయుతవాక్చాతుర్యతంబల్కునో
ధీరా రాక్షసముఖ్యకౌశలమె మచ్చిత్తంబు శంకాప్తిచే
కూరెన్సత్వరమీవువచ్చుటనురక్షోనాశమూలంబునన్.

సీ. మారీచుచేత సన్మానంబు లంది కౌ
శలము ప్రార్థింపఁ బ్రసన్నమతినిఁ
దాటకేయునిజూచి దశవదనుం డైన
రావణుం డను వాక్యకోవిదుండు
అశ్లిష్టకర్ముఁడౌ నలరాముచేత న
రాక్షసం బగుచు దర్పంబు మాని

వరజనస్థాన మవధ్యంబు సర్వంబు
  రహింసి పాతితిమయ్యె రణమునందు
నట్లుగావునఁ దద్భార్య నపహరించు
మత్సహాయత నర్తిలి మనుపు మనుచు
వేఁడుదశకంఠుపలుకులు విని యుదగ్ర
రీతిఁ గనుఁగొని పల్కె మారీచుఁ డంత. 23

ఉ. ఎవ్వఁడు మిత్రుఁడై పగిది నేర్పడనీ కెఱుఁగంగఁ జెప్పెనేఁ
డివ్వసుధన్వినిందితుఁడ యెవ్వఁడు నందితుఁ జేసెనక్కటా
యవ్వసుధాసుతాపహృతమారయ నెవ్వఁడుదెల్పె దెల్పుమా
క్రొవ్విననిశాచరప్రవర కోటులశృంగవిభిన్న మెంచుచున్. 24

మ. నినుఁ బ్రోత్సాహునిఁ జేసె నెవ్వఁడతఁడై నిక్కంబుగా శత్రుఁడున్
వినుమాశీవిష దంష్ట్రిముం బెఱుకనుద్వేష్టించియుంకించెదీ
వనియీశ్వాపథ వృత్తకృత్యములనిర్వర్తింప నేమించెధా
త్రినినిద్రించిసుఖించునీతలకునెంతేరాయి పూనెంగదా.

చ. ధరణి విశుద్ధవంశమహితాభిజనప్రియకృత్య జన్మము
ద్వరమదయుక్తమై ప్రకటబాహువృషాణయుతప్రగల్భమా
గురుతరరామనామమదకుంజరమొప్పును దేఱిచూడ దు
ర్భరమగు రాక్షసేంద్ర బహుభంగులఁ జేర నయుక్తమెన్నఁగన్. 26

చ. రణభువినిర్విదగ్ధబహురాక్షసబృందముగల్గు నేఁ డవా
రణమతిసంధివాలముశరాంగసుపూర్ణముఁగ్రోధయుక్తముఁ
గణకనతీత మహాబలిమి గల్గియు నానిశితాసిదంష్ట్రిస
ద్గుణయుతమహానృసింహమతిదుర్భరమైనిదురించువేళ ధా
రుణినిఁ బ్రబోధుఁ జేసియదిరోషముఁ జెందిన మేలుగల్గునే.

మ. స్వభుజావేగసుపంకిలంబును మహాచాపాపహారంబు స
ద్రభసావేశమహార్ణవౌఘము వరోద్యన్మాలికోర్ముల్విసం
క్షుభితాత్యంతసుఘోర మైనయది రక్షోదేవపాతాళస
న్నిభమా ఘోరముఖంబు డాయఁ దగదున్నిద్రస్థితిన్రావణా.

సీ. ఈక్షణమేవడింజనుమయోలుమలంకనుసుప్రసన్నుఁ డై
రాక్షసనాథ పౌరులనురంజిలఁ జేయుము నిర్మలాత్ముఁ డై
లక్షణవంతుఁ డై సువిమలాంగులస్త్రీయలఁ గూడియుండు మీా
రాక్షితినాయకుండునుబ్రియాయుతుడై రమియించునవ్వనిన్

క. ఆవని మారీచునిచే
నీవిధిఁ దెలిపొంది తిరిగి యేగి ముదముతో
లావరియై యుండె దశ
గ్రీవుఁడు నిజపురముఁ జొచ్చి గిరిసన్నిభుఁ డై. 80

# 2. కులశేఖరమహీపాలచరిత్ర:

---

ఉ. ఆనృపవర్యుఁడాఘనునియానతిఁ గైకొని సద్గుణాన్వితున్
సూనుని యౌవరాజ్యపద శోభితుఁ గా నొనరించి నిర్భరుం
డై నిజబుద్ధికిం గడుఁ బ్రియంబగు రామకథాసుధారసం
బానుచునుండెఁ గర్ణములనందొక వైష్ణవముఖ్యసన్నిధిన్.

సీ. కౌశికువెంట రాఘవుఁడు కాల్నడ నేగె
నను చోట రథిఁ జేతు నని తలంచు
భార్గవుం డాగి రాముపైఁ గిన్క నేతెంచె
నను చోటఁ దా నెదుర్కొనఁ దలంచుఁ
గై కేయి జానకీకాంతుఁ గానలఁ ద్రోచె
నను చోట మరలింతు నని తలంచు
దశరథాత్మజుఁ డద్రితటుల నెక్కఁదొడంగె
నను చోటఁ దా నెత్తుకొనఁ దలంచు
వితతకాకుత్స్థగుణకథామృతరసైక
పానకౌతుకవిఖ్యాతభావుఁ డగుట
నమ్మహారాజు తలఁపు లి ట్లగ్గలించుఁ
గాలభేదంబు తెలియనికారణమున.

గీ. ఇత్తెఱంగున నవ్వైష్ణవోత్తముండు
సంతతము దాశరథికథ జనవిభునకుఁ
దెలుపునెడ ఖరదూషణాది ప్రచండ
సమరసన్నాహన ప్రసంగము పొసంగె. 3

మ. అశనిధ్వానసమార్భటిం బ్రళయమేఘాకారదేహుల్పతు
ర్దశసాహస్ర నిశాటవీరభటు లుద్యల్లీలఁ గొల్వన్ ఖర
త్రిశిరోదూషణముఖ్యు లారఘుకులశ్రేష్ఠు ల్వేసన్ గెల్వన
శ్వశతాంగేభపదాహతక్షితిరజస్సంఛన్నదిగ్భాగులై. 4

క. అని కతఁ జెప్పిన విని య
జ్జనపతి తాత్కాలిక ప్రసంగం బనుచుం
గినిసి రఘువీరపదభా
వన నొదవిన భక్తిపారవశ్యముకతనన్.

ఉ. అక్కట ధర్మవత్సలుఁ డుదగ్రగతింతన దేవితోడఁ దా
నొక్కరుఁడేగు దేరరిపుయూథ మెదిర్చెఁగదా భరంబగున్
గ్రక్కునఁ దోడ్పడందగు ననం గతచెప్పిన వైష్ణవుం డిడే
మెక్కడవచ్చె నంచుభయ మెత్తిదిగుల్పడిచూచుచుండఁగన్

శా. చండక్రోధరసజ్వలజ్జ్వలనచంచద్విస్ఫులింగంబు లొం
డొండం గన్గవ క్రేవలన్ వెడల నత్యుగ్రాకృతిం దాల్చిమా
ర్తాండ ప్రక్రియనున్న రాజుఁ గనునంతన్ మంత్రిసామంతులా
దండన్ నిల్వగఁజాలరైరి భయచింతావిస్మయభ్రాంతులై

వ. ఇవ్విధంబున ధృఢవ్రతతనయుండు సంగ్రామసంరంభ
విజృంభితుండై ప్రయాణభేరి వేయించిన-

స్రగ్ధర. తలకొందెన్ భూరిభేరీ
ధ్వని చెవిసోఁర దిగ్దంతు లత్యంతభీతిన్
గలుషీభూతంబు లయ్యెం
గడఁకి జలనిధుల్ కంపమందెన్ మహాద్రుల్
బలభిన్ముఖ్యా మృతాంధః
ప్రవరులదటునం బల్కి రాశ్చర్య మంచుం
దలయూఁచెన్ ధాత రాజో
త్తము రఘుపతి సద్భక్తి మెచ్చుల్ ఘటింపన్. 9

వ. అంత నమ్మహీవల్లభుండు.

ఉ. దిగ్గనలేచి వీరరస దీప్తముఖాంబుజుఁడై నరేశ్వరుం
డగ్గలికన్ ధనుశ్శరగదాసిముఖాయుధభీషణంబు న
వ్యగ్గతిశోభితోత్తమహయాన్వితమై మణిమాలికావళి
న్నిగ్గులుదేఱు తేరెదుట నిల్పిన సారథిఁజూచి ప్రీతుఁడై.

వ. తదారోహణం బాచరించి

క. సదమలతేజుఁడు రథహయ
మదకుంజర వీరభటసమాజము తన్నుం
జాదివికొని నడువ నరిగెన్
మది రాఘవకార్యభరసమగ్రం బగుటన్. 12

మ. నిపుణాశ్వౌఘఖురాగ్రధూత మగుచుం గెందూళి!
పైపోఁక వి।ష్ణుపదీగాహనవాంఛ నేగుటయు నచ్చోఁ దద్ర
జోవ్యాప్తిత।ద్విపరీతాకృతికిం దొలంగి వెస నబ్ధిం జేరి
తద్రేణుశో।ణపయఃపూరము క్రమ్మఱంగని నగె న్వై
మానికవ్రాతముల్. 14

వ. ఇవ్విధంబునం జతురంగబలపరివృతుండై కోదండకళాప్రచండభుజదండమండితుండగు నద్ధరాఖండలుండు సీతావల్లభునకు సమరసాహాయ్యంబొనరింప నుద్యోగించు నవసరంబున.

క. అది యెల్లఁ జూచి మంత్రులు
తుది మొదలు నెఱుంగఁబడని దుష్కరకార్యం
బిది మానుప నెట్లగు నని
మది నాశ్చర్యంబు భయము మల్లడిఁగొనగాన్. 15

ఉ. ఎన్నటికైక యీవరము లెన్నఁటి రాఘవరాజ్యవర్జనం
బెన్నఁటి దండకోపగమ మెన్నఁటి తాపసవేషధారణం
బెన్నఁటి రాక్షసీవికృతి యెన్నఁటివారు ఖరాదిదానవుల్
నిన్నఁటి నేఁటి కార్యమగు నేనృపుఁ డేడ యెఱుంగఁ డక్కటా

ఉ. సంతతమున్ దిశాంతరనిశాంతులు వైష్ణవులేగుదెంచి యే
చింతకుఁ దారమై మనలఁ జెంతలఁ జేరఁగనీక రాజు నే
కాంతకథావిచిత్రిత వికల్పములం గను వెఱ్ఱిఁ జేసి హా
యెంతకుఁ దెచ్చిరయ్యలిక నెవ్వరికిం దర మేమరల్పఁగన్.

గీ. సచివు లిట్లు వితర్కించి సమయసముచి
తాప్తులగు వారి నల్వుర నరసి తగిన
కార్య మెఱిఁగించి పంచినఁ గడఁగి వారు
సైన్యములకెల్లఁ గ్రేడించి చనిరి వేగ.   19

సీ. సముదితశ్రమబిందుసరణి ముల్జీరలు
మేనుల మలకలై కానుపింపఁ
గవయు బేరెండల కడిమిచేఁ గ్రాఁగుకన్
గవలు కెంజివురులకరణిఁ దనర
రాలెడు వేణుపత్రములు గ్రమ్మినమస్త
కముల పుష్పరజంబు గ్రమ్ముకొనఁగఁ
దాడిఁబడ నీరముల్ దూఱి కొఱ్ఱులఁ బెట్టు
కట్టువల్వల సీరికలు నటింపఁ
జేరువల సారువల వెంటఁ జేరి తిరిగి
దండకాటవియందుండి తరలివచ్చి
నట్లు మాయాపరిశ్రమం బలవరించి
మనుజపతిచూడ్కి నొదవి రమాత్యహితులు.   20

క. డాయఁ బిలిచి వారలతో
నేయెడలందుండి మీర లిటవచ్చితి రి
ట్లాయాసపడుచు ననపుడు
మాయికు లి ట్లనిరి రాజమణికిఁ బ్రణతులై.   21

ఉ. భూవరదండకాటవులపొంతఘనాఘధులుండునంచు దే
జోవఁగనందు బాహుబలభూషణుఁడా రఘువీరుఁడుగ్రదై
త్యావలితోరణంబునకునాయితమౌటయునేముఁజెంగటన్
గ్రావతటంబునన్ నిలిచి కన్గొనుచుండితి మద్భుతంబుగన్.

ఆ. ఇనకులోత్తముఁ డసురుల నెల్లఁ దునిమి
నపుడు శోణితవేణిక లడరఁ జూచి
వెఱచి పఱతెంచినార ముర్వీతలేశ
యనుచుఁ జెప్పిన వెఱఁగంది యతఁడు పలికె. 23

క. ఈగతిగా నొకరఘుపతి
నాగాశ్వభటోగ్రదైత్యనాశక్రీడా
రాగోద్ధతుఁడై యెసఁగుట
భోగీంద్రశయానుఁ డతఁడపా యూహింపన్. 24

చ. అనుటయు వార లానృపకులాగ్రణిఁ జూచి రఘూద్వహుండు ము
న్ననసిన బాల్యవేళ మిథిలేంద్రునివీటన రేంద్రులెల్ల ము
న్గనియుకపర్దికార్ముకము కేలఁ దెమల్పఁగనేగుచున్నచో
జనకునిసంశయంబెడఁగిచయ్యనగాధిసుతుండునవ్వుచున్.

శా. బాలుండీనరపాలసూనుఁడు ధనుర్భారంబతిస్ఫారమే
లీలన్ దీనిఁ గదల్పనోపునొకొ యాఁతేఁ జేత నంచాత్తను
త్యాల్యాలం బెట్టకు చండభానుగహనోగ్రావాసముద్రేందుబి

శ్చాలోద్యద్ద్రుహిణాండభాండమెగ వైవంజాలుహేలాగతిన్

గీ. అనుచు ముని పల్కుపల్కులు జనము లెల్లఁ
గతలుగాఁ జెప్ప వినమె లోకప్రచార
మరసి రక్షించునట్టి మహానుభావుఁ
డకట మనసాహ్య మతని కే మగు నృపాల. 27

క. అని వారు పలుకు పలుకులు
విని సంతసమంది సుభటవిసరము గొలువం
జని పురముఁ జొచ్చి యచ్చట
సనయస్థితి నుండె రామచరితము వినుచున్. 28



# 3. జ య వి జ యా భ్యు ద య ము.

—:o:—

క. విలసితసమస్తభోగం
బులఁ బొందలితి శత్రునిచయముల గెల్చి ధరా
వలయం బేలితిఁ గొడుకులు
గలిగిన సార్థకము గాదె కమలదళాక్షీ. 1

సీ. కొడుకులు లేనట్టి కుటిలాత్మకునిగృహం
బరయ సింగములేని యడవి గాదె
తనయులు లేనట్టి మనుజుని బ్రతుకు కీ
రము లేనిమణిపంజరంబు గాదె
సంతానహీనుఁ డౌ జడుజీవనము సౌర
భంబులేనట్టి పుష్పంబు గాదె
సుతులఁ గాంచనియట్టి యతికష్టతముని సా
మ్రాజ్య మిందుఁడు లేనిరాత్రి గాదె
పుత్రహీనుండు సద్గతిఁ బొందఁగలఁడె
నందనులు లేనివాని కానంద మేల
సకలవిభవంబు లివి యేల సదన మేల
యాత్మజులు లేకయున్నను నబ్జవదన. 2

ఉ. సంతతి లేని మానవుని జన్మము సార్థముగాదు గానతో
కాంతవనాంతవీథికిని గౌరవమొప్పఁగఁ బోయియయ్యుమా
కాంతుని మోక్షనాయకునిఁ గాళగళు న్మదిలోననిల్పి వి
శ్రాంతిమెయిన్ జపం బొనరఁ జల్పిసుపుత్త్రులఁగాంతు
వేడుకన్. 3

క. అని నిశ్చయించి సుతకీ
ర్తిని జేరఁగ బిల్చి మంత్రితిలకా పరమే
శుని మదిని నిల్పి నేఁ దప
మొనరింపఁగఁ బోయెదన్ సముజ్జ్వలభక్తిన్. 4

గీ. పట్టణములోన బ్రాహ్మణబాలవృద్ధ
జనులు నాశ్రితులును మంత్రిజనులుఁ బ్రజలు
గలరు వారల నందఱిఁ గ్రమముతోడఁ
బ్రోచుచుండుము కారుణ్యబుద్ధితోడ. 5

వ. అని యొప్పగించి చెప్పఁగలబుద్ధు లన్నియుఁ జెప్పి
మఱియు: 6

ఉ. ఆవసుమంతభూరమణుఁ డంగనఁగన్గొనిపోయివచ్చెదన్
శ్రీవనితాలలామ మది నూఱటఁ జెందు సుపుత్త్రకాంక్షచే
భావజసంహరున్ హరుని భద్రగజాసురకృత్తివాసునిన్
భావములోన మానక తపంబొనరించెదభక్తితోడుతన్.

వ. అని యివ్విధంబునం దనభార్యారత్నంబు నొడంబఱిచి
బంధుమిత్త్రామాత్యపరిజనంబులకు నయ్యైప్రకారంబులఁ

దెలియంజెప్పి సంతానకాంక్ష మనంబున ముప్పిరిగొనఁ
బురంబు నిర్గమించి చనిచని ముందట: 8

చ. పురములఁజూచుచున్నదులపొంతలఁబోవుచునిర్మలంబులౌ
సరసులఁ దోఁగుచున్ వకుళచందన తాలతమాల కేతకీ
కురవక మన్మథ క్రముకగుగ్గులచూత పలాశభూరుహో
త్కరములదండనిల్చుచునుదద్దయుదుష్టమృగాళిఁదోలుచున్

చ. మఱియుజనంజనంగనియెమంజులవంజులకుంజపుంజసుం
దరవితతప్రపాంతరయుతా మితకుంభనికుంభితామృత
స్ఫురితపయోపదివ్యకరభోరులసన్ముఖచంద్రదీప్తిభా
స్వరదుఁడుపాశ్వవేదికలజాడల నేగు వనేచరాదులన్. 10

సీ. విలసితైరావతకలితమై శతమన్యు
విభవంబునుంబోలె వృద్ధిఁజెంది
మహితగాయత్రీసమన్వితంబై చతు
రాగమంబును బోలె నతిశయిల్లి
హైమవతీయుక్తమై పరమేశ్వరు
దేహంబునుంబోలెఁ దేజరిల్లి
మన్మథోజ్జృంభమై మహితవసంతర్తు
కాలంబునుంబోలె ఘనతగాంచి
యర్జునస్యందనాతిబాణాసనాత్త
మై కురుక్షేత్రమునుబోలె ననువుఁ జెంది

వీరతరుకాండశోభితోద్వేల మైర
ణంబునుంబోలె నలరువనాళిఁ గాంచి. 11

వ. ఇట్లఖిలలోకమనోల్లాసం బగువనంబులం దిరుగుచు మఱియు నతిభయంకరంబు లగుఘోరారణ్యంబులు గడచి పుణ్యనదీనదంబుల దాఁటి సకలమునీశ్వరాశ్రమస్థలంబుల నిలుచుచు సంతానవాంఛ మనంబునఁ బెనంగొనం జనిచని ముంగట. 12

సీ. రమణీయశిఖరసంనిర్ఝరంబులు
పట్టాభిషేకాంకపటలి గాఁగ
గంధవాహోద్ధూతగైరికధాతుప
రాగంబు హేమాంబరంబు గాఁగ
మస్కరాయుతగళన్మౌక్తికవ్రాతంబు
చెలువైన ముత్యాలసేస గాఁగ
నానావిధమృగాభినవఘోషములు వీర
భటచటులార్భటీపటిమ గాఁగఁ
గరుడగంధర్వకిన్నరఖచరసిద్ధ
సాధ్యచారణు లురుసభాసదులు గాఁగఁ
బర్వతాధిపతిత్వ మేర్పడఁగ నలరు
గంధమాదనకుధరంబుఁ గనియె నతఁడు. 13

మ. కని తద్భూమిధరాగ్రభాగవిలసత్కల్పద్రుసీకాశభూ
జనటద్భ్రంభరశారికాన్యభృతపక్షివ్రాతసంజాలపా

వనముల్ వ్యోమధునీకనజ్జలజభాస్వత్క్షౌద్రధారాపరా
గనితాంతాప్తిగి శైత్యమాంద్యసురభిఖ్యాతిం దగన్వీ
వఁగన్ 14

వ. మార్గశ్రమం బపనయించి యచ్చట ననంతకషణోత్తుంగశాఖిశాఖాలంబితవల్లీమతల్లికల నొయ్య నొయ్యన నొయ్యారంబున నుయ్యెలలూఁగు గరుడగంధర్వసిద్ధవిద్యాధరాంగనల సొబగులు చూచుచు మంజుల లవలీనికుంజపుంజాభ్యంతరసుఖాసీనవనచరవనచరనయనాశరసరసిజభరితశరాసనవినిర్ముక్తశరాస్ఫోటనంబుల బెఱుకంట నొరలుచుం గూలు మత్తమాతంగసంఘశుంభత్కుంభస్థల గళితమౌక్తికవ్రాతంబు లుల్లాసంబున నేఱి విచ్చలవిడి నచ్చనగం గ్రాడుకిన్నరకామినులవైఖరులు విలోకించుచుఁ గమలకహ్లారకైరవాలోలవిలసన్నరందపూరప్రపూరితోదరంబులై పొగరుమిగిలి గగనమున కెగిరి సొంపునం గుంపులుగొని చక్రాకారంబుగా విహరించు చంచచ్చంచరీకసముదయంబుల నొప్పారు సరసిజాకరతీరంబుల చెంత విశ్రమించుచుఁ గుటిలతరవిటపీవిటపపటలాంతరోటజవసజ్జటామకుటరచితహోమంబులం బొడముధూమంబు లనంతవ్యాపితంబులై యనున్నం గనుంగొని జీమూతవ్రాతంబు లని పరిభ్రాంతి నొంది పటుజవంబున నటనంబులు సలుపు మయూరకే

కారవాకర్ణనసంప్రాప్తభయోదీర్ణనయనకర్ణఫణామణిప్ర
భావిభాసితగుహానివహంబులన్ దర్శించుచుఁ దక్కిన
చోటులం గలవిచిత్రంబు లన్నియుం గనుంగొనుచు న
సంభ్రమస్వాంతుండై మఱియు: 15

చ. జనవరుఁ డయ్యెడం గనకశైలశరాసనుఁగూర్చి మానసం
బునఁ జలనంబు లేక తపమున్ సవరింపఁదలంచి శాంతిస
త్యనయవచోధురంధరులు తాపసులిచ్చటనుందురండ్రు వా
రినడిగితద్విధంబునఁ జరించెదఁగాక నినిశ్చయాత్ముఁడై 16

సీ. కౌతమసింగంబులు మదగజంబుల కరం
బులు కరంబులఁ బట్టి మురియుచుండు
నకులంబులును బవనాదపోతములకుఁ
బ్రీతితోఁ జన్నిచ్చి పెనుచుచుండు
శార్దూలములు వినిశ్చలవృత్తి నఖముల
గిరి మేషములరొమ్ముడల్ గీరుచుండు
మార్జాలములు మది మచ్చరంబులు మాని
యాఖుడింభములతో నాడుచుండు
సారమేయంబు లురుశశశాబకములఁ
గూడి క్రీడించుఁ బరమానుగుణ్యలీల
నిటులు తమజాతివైరంబు లేమి లేక
తనరు మౌనీశ్వరాశ్రమస్థలముఁ గనియె. 18

వ. కనుంగొని తద్విచిత్రంబున కద్భుతమానసుఁడై పర
మాహ్లాదంబునొంది యచ్చట నిశ్చలధ్యాననిష్ఠాగరి
ష్ఠుండై నిమీలితలోచనాంబుజుండై తపం బొనర్చు
మునీశ్వరుం గాంచి యారాజచంద్రుం డాత్మగతంబున: 18

మ. హరియే యీఘనుఁడైనఁ జక్రదరచిహ్నల్ గౌస్తుం బెద్దిశం
కరుఁడే యీమునియైన హాలధృతరేఖాచంద్రమం బెద్దియో
సరసీజాసనుఁడే యితండయిన భాషాదేవి గన్పింప తే
విరవందన్ ముఖరేకమై నిలిచిన ట్లేపారెడిం జూడఁగన్. 18

వ. అని వితర్కించుచు నాసమయంబున. 19

ఉ. భీతి మదిం బెనంగొనఁగ బెగ్గిలుచుం గడుసంశయంబుతో
సీతనిఁ బల్లరించుటకు నేదియుపాయము సన్మునీంద్రులుం
బ్రీతిమెయిం గృపామతిని బిల్చినఁ బల్కుట యుత్తమంబుగా
కీతతి నేనె మున్నుగన హీనతఁ బిల్చిన నూరకుందురే. 20

వ. అని తనమనంబున నొకయుపాయంబూహించి. 21

గీ. ప్రస్తరద్వయ మప్పు డుపాయ మెఱుఁగ
నట్టులన తెచ్చి జంటగా నమరఁబెట్టి
వానిపై నొకకుంభంబు పూని నిలిపి
యున్న మొనరింపఁ బోయిన నదియుఁ బొల్లె. 22

ఉ. క్రమ్మఱఁ దత్సమీపమునఁ గన్పడు బావికిఁ బోయి కుండతో
నమ్మెయి నీళ్ళు దెచ్చి జ్వాలనంటు నుమంట యొనర్చి రెండు దా

ళ్ళిమ్ముగఁ జేసి పెట్ట నది యెప్పటియట్లనె పారిపోయినం
గ్రమ్మఱనట్లకష్టపడఁగన్గొని మౌనిదయామయాత్ముఁడై.

గీ. అతని కిట్టులనియె నయ్య నీవెవ్వఁడ
విటులు సేయ నిది వివేక మగునె
మూఁడుశిలలమీఁదఁ బొందుగా ఘట మిడి
యగ్గి మంటసేయ నన్న మగును. 24

వ. అని మునీంద్రుండు చెప్పిన విని భయభక్తిసంభ్రమం
బులు మనంబునఁ బెనంగొన నారాజవర్యుం డతనికి
సాష్టాంగనమస్కారంబు లాచరించి ముకుళితకరకమ
లుండై యి ట్లనియె. 25

చ. మునివర విష్ణుచక్రపురముం బరిపాలన చేయువాఁడ నే
వనరుహ బాంధవాభిజనవార్ధివిధుండనజాతశత్రుఁడన్
వినువసుమంతనాముఁడనవీనయశుండసుపుత్రకాంక్ష చే।ఘన
తపమాచరించుటకుఁగానిటవచ్చితినయ్యయియ్యెడన్.

గీ. ధన్యులైనట్టిమౌనులదండఁ జేరి
తద్విధానంబుఁ దెలిసి నేఁదపమొనర్తు
ననుచు నిచ్చోటి కేతేర నాదుభాగ్య
వశత మిముఁగంటి ఫలియించె వాంఛితములు. 27

మ. అనినన్ భూవరుతోడనమ్మునివరుం డాహ్లాదతం బల్కె మే
మనయుంబుందపమాచరించుటలుఁ బ్రేమ న్సమ్ముసద్భక్తిగా

ల్చినవారీప్సితమేమిగోరిననుయిచ్చేపాటిసామర్థ్యమున్
ఘనకైవల్యపదంబుఁజెందుటకునై కాంక్షించికాకేటికిన్.

వ. కావున. 29

క. మావంటిమునుల సేవలు
భావంబునఁ గొంకు లేక భక్త్యతిశయులై
కావించువారి కోరుకు
లేవెరవుననైనఁ గరుణ నిచ్చెద మనఘా. 30

క. సంతానకాంక్ష నీక్రియఁ
జింతింపఁగ నేల నీకుఁ జెల్వుగ సుతులన్
సంతోషకరుల నిచ్చెద
సంతతసద్ధర్మశీల సద్గుణజాలా. 31

చ. విను మొకమాటచెప్పెదవివేకధురంధరనీకుఁబుత్రులన్
ఘనతరదేహులంగుసుమకార్ముకరూపవిలాసులన్ బుధా
వనులఁ జిరాయురున్నతుల వారక నిర్వ్వరనిత్తు వారిలోఁ
దనరఁగమాకునొక్కనిముదంబుననీవలయున్నిజంబుగన్

వ. అని చెప్పిన. 32

గీ. అనఘ! సంయమీంద్ర యాశ్రితజనవిప
ద్వార్ధిభంగతుంగతారణప్ల
వా! మహానుభావ!భవదాజ్ఞ తలమోసి
నడచువాఁడ ననియె నరవరుండు. 34

వ. ఇట్లు సాభిప్రాయంబుగాఁ జెప్పిన వచనంబులకు మునీం
ద్రుండు సంతోషించి తత్తపోవనంబునఁ గుసుమఫల
భరితం బై గగనంకషోన్నతం బై సకలలోకానందక
రం బై యున్న సహకారమహీరుహంబుఁ జూపి యా
భూజం బెక్కి ఫలయుగంబు గైకొని రమ్మని సెలవొ
సంగుటయు. 35

చ. మునివరునాజ్ఞ రాజుతల మోపి మహీజముఁ జేరఁబోయి చ
య్యన నెగఁబ్రాకి తత్ఫలము లానమెయి న్నొడినిండఁ
గోసి నెమ్మనము ప్రమోదవారినిధి మగ్నముగాఁగ మ
హీరుహంబుడిగ్గన దిగి చూచెన్ ఫలయుగంబునుజ్జికి న
నద్భుతాత్ముఁడై. 36

ఉ. క్రమ్మఱ భూజమెక్కి ఫలకాండములన్నొడినిండగోసి తే
నమ్మయి సట్లయుండెను జనాధ[illegible]భయవిస్మయంబు
లున్ నెమ్మదిలోఁ బెనంగొనఁగ నేర్పుమెయి న్నగమెక్కి
పండ్లు దే నిమ్ముల నట్లెయుండిన ననిందితవిక్రముఁడాత్మ
లోవలన్. 37

క. ఇది యేమిమాయ యొక్కొ
పదపడి యొడినిండఁ గోసె ఫలములు దేరెం
డదనఁ గనుపించుచున్నవి
నదయుం డగు మౌనియాజ్ఞఁ జనునే గడవన్. 38

మ. అనుచున్భూమివరుండుతత్ఫలయుగంబవ్వేళ వేగొంచు
బోయినితాంతోజ్జ్వలభక్తిఁజొప్పడఁగ మౌనీంద్రుండ
గంజేరినేర్పున సాష్టాంగనమస్కృతుల్సలిపి సన్మోదం
బుతో నాతఁడాతనివీక్షించి దయన్ఫలద్వయము హస్త
స్పర్శ గావించుచున్. 39

కం. నరవరునకు మునినాథుం
డరయఁగ నబ్జారిధరుని హరుని మహేశున్
స్మరియించుచుఁ దత్ఫలయుగ
మిరవుగను విభూతితోడ నిచ్చెం గరుణన్ 40

వ. ఇట్లిచ్చి మఱియు నిట్లనియె. 41

మ. ధరణీనాయక యీఫలంబులుభవత్కాంతాలలామంబున
త్యరతం గైకొన నామెగర్భమున సౌందర్యాంకులజ్ఞాన
శౌర్యాదిప్రోజ్జృంభితులాద్యపావనులుభవ్యాచారులు
న్నాఁగశ్రీకోత్తరసంతతులుద్భవింపుదురు పుత్రద్వంద్వ
ము ల్వేడుకన్. 42

కం. ఇచ్చితి ఫలంబు లిపుడే
మెచ్చుగఁ గొనిపోయి నీదు మెలఁత కొసఁగినన్
హెచ్చుగ లే దద్దఱుసుతు
లచ్చుగఁ గల్గుదురు మన్మథాకారులు నై. 43

కం. జననాథ నీవు నాతో
మును చెప్పినసత్యవాక్యమును దప్పకుమీ

యనుచు మునిచంద్రు నృపకుల
మునఁ బుట్టినవాడు పలికిబొంకఁడురె ధరణి. 44

శా. సత్యాచారవిహారియై సుజనరక్షాదీక్షఁ బెంపొందునా
సత్యాకార విరాజితుం డగుహరిశ్చంద్రుండు గాధేయుచే
నిత్యంబుగ్ర్వమఁ జెందియుంగడపటన్నిర్హిద్రకారుణ్యము
న్సత్యాలాపము గాంచి యాఘనుఁడు రాజ్యం బీయఁ
డే క్రమ్మఱన్. 45

వ. అని నిశ్చయంబుగాఁ బలికి తనకార్యసిద్ధి యగుట
కత్యంతసంతోషాక్రాంతస్వాంతుండై తి[illegible]ంబ. 46

మ. ధరణీశోత్తముఁ డప్పుడామునివరు పాదాబ్జంబులన్ వ్రాలిభా
సురపుణ్యాత్మక పోయివచ్చెద నటంచుం జెప్పి సెల్వొందిస
త్వరతన్స్వాభిధరాగ్రమున్దిగిప్రమోదంబొప్పనిత్యప్రయా
ణరతిన్స్వాత్మపురోపకంఠవనమూనంకంబుగాఁ జేరెఁ దాన్

వ. ఇట్లు చేరి యచ్చట స్నానసంధ్యాది నిత్యకృత్యంబులు
దీర్చి శీతలతరుచ్ఛాయ నధివసించి సుఖోపవిష్టుండై
యుండినంత నేతద్వృత్తాంతం బంతయు విని పురం
బున బంధుమిత్రామాత్యజనంబు లానందజలధి నోల
లాడి యనంతరంబ యరుగుదెమలోన.

సీ. రాజు పుత్రార్థియై మునిరాజుచేత
వరముఁ గొనివచ్చి యుద్యానవనముఁ జేరి

యున్న వాఁ డచ్చటికిఁ బోయి యుచితగతిని
దోడుకొని రాఁగ నెంచు నెంతో ముదమున. 49

వ. నతఁ డిత్త్రియు బాంధవామాత్యసుహృజ్జనంబులును నటవిట గాయనీ గాయకజనంబులును రథగజాశ్వముఖ్య చతురంగబలంబులును నానావిధవస్త్రమణిభూషణాలంకృతులై వెంబడి నడువ భేరీమృదంగ శంఖకాహళ వేణువీణాపటహాదివాద్యనినదంబులు దిగంతదంతావళశ్రోత్రకుహరంబులకు బధిరత్వంబు సంపాదింప వందిమాగధసందోహంబుల కైవారధ్వనులు రోదసీకుహరాంతరాళంబులు నిండ నిట్లనంతవైభవంబున నయ్యుద్యానవనంబు చేరం జనుదెంచి యచ్చట నా రాజచంద్రునిం గాంచి దండప్రణామాదితత్తదుపచారంబుల సంభావించి భద్రగజాధిరూఢుం గావించుకొని సమస్తజనంబు నిరుగడలం గొలిచి నడువ రాజమార్గమున నేతెంచుసమయంబున. 50

సీ. భూమీశ్వరుఁడు తపం బొనరించి ధన్యుఁడై
వచ్చినాఁ డఁట గదె వనితలార
పుణ్యాత్ముఁ డాతండు పూనినకార్యంబు
సఫల మై యుండునే సకియలార
సత్యశీలయుఁ దొంటిజన్మంబునం దే మి
భాగ్యంబు చేసెనో భామలార

మనరాజు సంతోషమహితుఁడై యుండినఁ
జల్లగాఁ జూతుమో శ్యామలార
యనుచుఁ దమలోన నొండొరు లాడుకొనుచు
నమలభూషణవస్త్రమాల్యానులేప
నాదులు ధరించి నీరాజనములు పూని
పౌరసతు లేఁగుదెంచిరి గారుమీఱ. 51

వ. ఇట్లపరిమితవైభవంబున నామహామహీశ్వరుండు నగరు
చేరంజని సమస్తజనంబుల నిజనివాసంబులకుఁ బొమ్మ
ని సెలవొసంగి కక్ష్యాంతరంబులు గడచి లోపలి
కరిగి యచ్చట నెనరుగా వచ్చిన సత్యశీలాదేవిన్
బహువిధంబులం గారవించి దనపోయివచ్చిన తెఱం
గాద్యంతంబు తెలియఁ జెప్పి మఱియును. 52

గీ. పత్నిఁ గనుఁగొని పలికె భూపాలకుండు
వనిత మానీశ్వరుఁడు ఫలద్వయ మొసంగె
నివియు భక్షింపఁ బుత్రు లనింద్యబలులు
గలుగుదు రటంచుఁ బలికె నిక్కంబుగాఁగ. 53

వ. అని తెలియంజెప్పి శుభముహూర్తంబున ఫలద్వయం
బొసంగుటయు నయ్యిందువదన మహాప్రసాదం బని
యంగీకరించి సంభ్రమస్వాంతయై ఫలంబులు గైకొని
భక్షించె నమ్మహీశ్వరుండు మహీసురలకు గోభూహి

రణ్యాదిదానంబు లనేకంబు లొసంగి పరమానందభరి
తాంతఃకరణుండై రాజ్యంబు పాలించుచుండె నంతట.

క. నిరుపమవైభవములచే
మెఱయుచు దినదినము మేరమీఱినసౌమ్య
స్ఫురణల వెలయుచు నుండఁగఁ
గరమరుదుగ నవ్వధూటి గర్భము దాల్చెన్. 55

క. ధాత్రిన్ సుమిత్ర లక్ష్మణ
శత్రుఘ్నులఁ గనినయట్లు జనవరపతియుం
బుత్రద్వయంబు గాంచె వి
చిత్రగతిం బూలవాన చెలువుగఁ గురిసెన్. 26

# 4. కేయూరబాహుచరిత్రము

క. ఇమ్ముగఁ జెలిమి యొనర్చిన
గుమ్మరిపుర్వ్వాలవిధంబు కుజనులు చూడన్
సన్మిత్రుఁడు తుదముట్టినఁ
దన్మిత్రుఁడు నీతిపరులు తగుమిత్రులకున్. 1

వ. అని మఱియు నిట్లనియె.

గీ. బుద్ధిమాలినకపి యొకభూమిపాలుఁ
జంపె హితుఁడయ్యు; నొకదొంగ శత్రుఁడయ్యు
విప్రు నొక్కనిఁ గాచె వివేకి యగుట
సుమతిపగ మేలు విమతినెయ్యమునకంటె. 3

వ. అది యెట్లనిన: 4

క. మందరపురిఁ గాంతాజన
కందర్పుఁడు గలఁడు రాజు ఖగవృత్తిసమా
ఖ్యం దనరి బుద్ధిమంతులఁ
జెందఁడు సాక్షరుఁడు గాఁడు శిశుకాలమునన్. 5

క. గర్వోద్ధతచాపలమున
దుర్వర్తనుఁడైన నృపసుతునిచే నిడుమల్
సర్వము గని తన్మంత్రులు
దుర్వారాసహ్యబహుళదుఃఖాన్వితులై. 6

వ. ఆత్మగతంబున 7

సీ. అక్షరజ్ఞుఁడు గానియతనికి శాస్త్రపు
రాణాగమాదులు రావు సారఁగ
గ్రంథాధిగమశక్తి గలుగక శుద్ధవి
వేకంబు లేదు వివేకబుద్ధి
కలుగక కర్తవ్యకర్మ మెఱుఁగఁడు
కర్తవ్య మెఱుఁగక కడఁగి చేయు
క్రియల నీగఁగ రానికిల్బిషంబులఁ బొందుఁ
బాపుఁడు నరకకూపమునఁ ద్రెళ్ళు
నరకవాసి వేదనుఁ డగుఁ బేదయై
కడుపుకొఱకుఁ బాతకములు చేసి
రౌరవమునఁ గూలుఁ గ్రమ్మఱ నట్ల యా
పదల కెల్లఁ గుదురు చదువులేమి. 8

వ. అని చింతించుచుండ నక్కాలంబున: 9

సీ. ఎలుకవేఁటలపేర నేఁగి పట్టణములోఁ
బ్రజలయిండ్లు కూలఁద్రవ్వఁ బంపుఁ
జెలఁగి డేగలకుఁ దొండల నేయఁబోయి ద్రా
క్షామండపంబులు గాసిసేయుఁ
గోడిపోరులపేర వాడలఁ దిరుగుచుఁ
బొడఁగన్నకడవలఁ బొలియఁజేయు

వేఁటకుక్కలఁ దెచ్చి విడిచి మందలలోని
మేఁకల కుసిగొల్పి మెచ్చి యార్చుఁ
గాలకింకరులట్టి కింకరులతోడఁ
గూడి రాఁ గూటి ప్రొద్దునఁ గుడుపు దొరఁగి
వెడఁగుఁదనముఁ బ్రల్లదములు వేనవేలు
మదముతోఁ జేయుచుండు నాకుమారుఁ డిట్లు. 10

క. ఊరులును బోనులు గూండ్లును
బహువిధయంత్రములు గాలిపడగలు బారిఁ గిం
కరులం బొడిపించెడి యా
పరభసములు దక్క నొండు సైఁప వశనిఁకన్. 11

క. ఆనరపతి యనువుగ నొక
వానరపోతంబుఁ దెచ్చి వాత్సల్యముతోఁ
దానిఁ బెనిచి యాయుధవి
ద్యానిపుణతఁ బొంపఁ జేసి యది వర్ధిలఁగన్. 12

క. కంచుకము దొడిగి కుండల
చంచత్కటకాదివేషచయ మిడి శిఖ
ద్గాంచితరూపముతోఁ దన
కంచుకి యై యుండఁ బనిచెఁ గదలక యెపుడున్ 13

సీ. ఆరాజు మందిరోద్యానంబునకు నేగి
యొకనాఁడు తాను బయోజముఖులుఁ

దడవుగాఁ గ్రీడించి యొడలు నిద్రాలసం
బగుటయు నంతట నచటనచట
వసియింపుఁ డని పంచి వనచర మొక్కఁడ
తోడరా దట్టంపునీడ నిలిచి
పరిమళమ్ము మసిఁ బవనంబు నెలవైన
గుఱివెందఁ గందిరి గుజ్జుసెజ్జ
నుత్తుఁ డగుచుండి వానరుఁ జూచి నన్ను
డాయవచ్చిన జీవుల వేయు ఖడ్గ
ధారఁ దునియంగ నని చెప్పి కూరె నిద్రఁ
గపియు బనిపూని భూపతిఁ గాంచియుండె. 14

వ. ఆసమయంబున: 15

మ. సుమనోదామము రాజుకంధరమునన్ శోభిల్లువత్తావికై
భ్రమరం బొక్కటి మూఁగ దానిఁ గని కోపవ్యగ్రమై క్రోఁతి ఖ
డ్గమున న్వేసిన దేఁటితోన ధరణీకాంతావతంసంబు కం
ఠము రెండయ్యె వినీతుఁడైన పతి చేష్టల్ చేటు దేకుండునే

వ. వివేకియైన చోరుండు శత్రుండైన విప్రుం గాచినవిధం
బెట్లనిన; 17

గీ. నందినీనామనగరంబునందుఁ గలఁడు
బంధుకుం డనియెడు నొకబ్రాహ్మణుండు
ధనికుఁ డతఁడు తొల్లి యవిలంఘ్యదైవఘటనఁ
బిన్నలై పుత్రులుండంగఁ బేదపడియె. 18

వ. అప్పుడు.

మ. కటిబద్ధాంబరఖండమృత్స్పటలికాక్రాంతహస్తోపాంతికన్
జటిలాపింగళకేశభారవ్రణితోష్ఠద్వంద్వదీనాననం గటకస్థా
నపరీతరజ్జువలయంగాత్రస్థమాలిన్యుత్కటబాష్పాతురుఁ
డు చూచెబంధుకుఁడు దుఃఖవ్యూహినిం గేహినిన్. 20

వ. అట్లు చూచుచు నాత్మగతంబున.

మ. బలవద్దైన్యమువక్షగహ్వరము గాఁ బలోచ్చట్లఁగోసట్టియ
ప్పులు మైచాఱలుగాఁగ బాలరుదితంబుల్ఘోరగుటల్గాఁగదు
ర్నిలయారణ్యములో భయప్రకరమూర్తి క్రూరమై యుండగా
దలమే వెల్వఁడఁ జేయ లావుకలిమిన్ దారిద్ర్యశార్దూలమున్.

ఉ. ఐనను దీనిఁ బాపఁదగుయత్నము చేసెదఁ గాక చిత్రవ
ర్ణనగరంబులో గుణగరిష్ఠుఁడుఁ బ్రాహ్మణుండు నై మదీ
యానుజుఁడున్న వాఁడు విపులాఖ్యుఁడు వానికి సొమ్ము గల్గఁగాఁ
నేసిటు బీదనై నవిధ మిచ్చ నెఱింగిన వాఁడు కుందఁడే

వ. అతం డొసంగుకనకము గొనివచ్చి యిచటం గర్షకుండ
నయ్యెద. 24

సీ. ఈలోక మింతయు నాలుగుపాళ్లు లిం
దొకట భిక్షుకులు సోమకులు నొక్క
పాలు సేవావృత్తి బ్రదికెడువారు వి
ద్యోపజీవికులును నొక్కపాలు

వ్యవహారమాడెడువారుఁ దస్కరులును
నొకపాలు కర్షకు లొక్కపాలు
మొదలిపాళులు మూఁడు బిదపటిపాలిన
యనవరతంబును నపహరించు
నపహరించియు నంతంత కవి నశించు
నపహృతం బయ్యు నది వృద్ధి నందుచుండుఁ
గానఁ దగురాజు గలిగిన గసనంపు
జీవనముఁ బోల దొండొక జీవనంబు. 25

క. అని తలఁచి కపిలి కతిపయ
దినముల ననుజపురి చేరి తెరువున డస్సెం
దనువు మును బీదయై నలఁ
గినమానసముకంటె మిగులఁ గృశమై యుండన్. 26

మ. అనుజాగారముఁ జేరవచ్చిన సతం డల్లంతఁ దా నగ్రజుం
గని సన్దేహముఁ బొందియుం గమనరేఖామాత్రశోధించి క
న్గొని కన్నీరునఁ బాదముల్గడుగ సమ్మోదమ్ముతో నెత్తి దీ
వన డగ్గుత్తిక డించ నాతఁ డది మున్వృత్తంబుతోఁ దమ్మునిన్.

వ. తదనంతరంబున.

క. విఫలుం డగ్రజునకుఁ దగు
నుపచారంబులు ప్రమోద ముత్కటముగని
కప్రభక్తిఁ జరిపి యాతఁడు
విపన్నుఁ డగు టతనిచేత విని దుఃఖితుఁ డై 29

వ. నిజపుత్త్రకళత్త్రసహితంబుగా నాతని నిష్టదేవతావిశేషంబున నారాధించుచుండ నొక్కమాసంబు చన బంధుకుండు తమ్మునితో నొకనాఁటిరాత్రి యెల్లి యవశ్యంబునం జనఘుఁ బయనంబు సేయవలయు నని నిశ్చయించి పలికిన నర్ధరాత్రసమయంబున నవ్విప్రకులుండు దనయంగణంబున గతపరిసాంద్రమాధవిలతాచ్ఛన్నం బగుచూతకుంజంబు క్రిందికిం బూర్వజుం దోడ్కొని పోయి వేకువన యతనిపయనం బగుటం దన్నిమిత్తంబు లగునాట లాడి.

క. కొనిపోవరాదు తెరువునఁ
గనకము తెక్కలి ఘనంబు కాకున్నను మో
వను రాదు పెద్ద హేమం
బని యన్నకుఁ దెలియఁజెప్పి యకుటిలమతి యై 31

వ. అనేకనిష్కసహస్రమూల్యం బగునొక్కమాణిక్యం బతనికి మ్రింగ నిచ్చి మీరు ప్రభాతకాలంబున జీర్ణమలినాంబరంబులు ధరియించి యరుగునది యని చెప్పి యిరువురు శయనస్థానంబుల కరుగుటయు. 33

క. వారలపలుకులుఁ దద్వ్యా
పారంబులుఁ దెలియనెఱిఁగి ప్రమదహృదయుఁడై
చోరుం డొకరుం డచ్చటి
భూరుహమున నుండి వారు పోయిన వెనుకన్.

ఉ. కన్నము వెట్టఁ జన్న నొకకంచముఁ జీరయుఁ గాకయబ్బదా
సన్నిలువం బ్రమాదము దివాలఁగ లాభము చేరెనాకు నే
నిన్నిసివచ్చి వేగుతఱి నిప్పటికిప్పుడె కూడి పోవుచుం
గన్నపు వేఁటమానిమణిఁ గైకొని ధన్యుఁడ నై చరించెదన్.

వ. అని నిశ్చయించి యచ్చటు వాసి పోయి ప్రభాతం బగుటయు:

గీ. పయనమై పోవు బ్రాహ్మణు పజ్జఁ బిగిలి
సాధు వోలె నాతనితోడ సముచితంపు
భాషలాడుచుఁ దనచేయుపనికి ననువు
తలఁచికొను జోరకుండును దనమనమున. 27

క. నడుమ నలవడదు మునుపటి
యడవిం దొరఁ జూతు నిప్పు డని తలఁచుచు న
య్యడవిఁ దరిసి యరుగఁగ న
క్కడఁ దెక్కలిగాఁడు వచ్చి కడురౌద్రమునన్. 38

క. ఇరువురఁ గట్టియుఁ గొట్టియు
బరిభవములు వెట్టఁ బేదపన్నల మనుచుం
గరుణముగఁ బలుకఁ గాఁ గృప
యొకఁగిన చిత్తముల వారు లొండొరుతోడన్. 39

క. ఈమొదటుల కీకోకలు
వేమైనను దగవు కపటవేషము లివి యీ
మాయలకు మనకు లేదె యు
పాయము చీరసము వీడఁ బట్టి యుదరముల్. 40

వ. అనుచుండ నందులో ముఖ్యులగువారు: 41

సీ. ప్రత్తి యొకనికడఁ బ్రయ్యంగ నందులోఁ
బసిఁడి లేకయున్నఁ బరుని బ్రదికి
యరుగనిత్త ముండినట్లైన నితిరుసి
ప్రత్తి యిదియె కార్యవృత్త మనుచు. 42

వ. నిశ్చయించి తమాయిఁకుపురిలోపల నొకని వధియింప నుద్యుక్తు లగుసమయంబున నంజోరుం డాత్మగతంబున.

క. ఏ నేమితలఁచి వచ్చినఁ
దా నేమితలంచె నిచట దైవం బవురా
తా నొక్కటి తలఁపగ విధి
తా నొక్కటి తలఁచు ననుట తథ్యం బయ్యెన్. 44

క. పావనుఁడు బ్రాహ్మణుం డని
భావింపక కారణముగఁ బాపాత్ముఁడ నై
యీవిప్రుఁ జంపఁ దలఁచితి
నావిధి యింట్లుండ నట్లు నా కేలబ్బెన్. 45

ఉ. ఒప్పమి సేయఁజేనిఁ దగునుత్తమువంశజుఁ జేసి నేరికిం
దప్పొనరింపఁజేసి నతిధార్మికుఁ జేసి దురాత్ముఁ జేసి వా
రప్పురపావతంసమున కొఱుకు యెగ్గొనరింపఁ జూచినం
దప్పని చేటు వారలకు దైవము న్నలుఁ బ్రబ్బుఁ జేఁసుతే.

సీ. ఇతనికడఁ బ్రవర్తించు నుద్దురత్నంబు
గాంచి లేనిఁ దనదుకడుపు ప్రత్తు

రురక చంపిపోదు రూరక విడువరు
కడుపు వ్రచ్చు బెట్లు గట్టి తనకు. 47

వ. అయినను: 48

క. తనకడుపు మున్ను వ్రచ్చినఁ
గనకము లేకున్న నతనిఁ గాచెద నెట్లుం
దను విడువ రింక బహుళచిం
తనములఁ బనియేల కాచెదం గా కితనిన్. 49

వ. అట్లుంగాక: 50

క. క్షీణకరుణచే బ్రాహ్మణు
ప్రాణముఁ గొనఁదలఁచినట్టి పాపము మగుడం
బ్రాణంబుఁ గాచి యతనికిఁ
బ్రాణం బీకున్న నెట్లు పాయఁగ నేర్చున్. 52

వ. అని కృతనిశ్చయుండై

క. తనకడుపు మున్ను వ్రచ్చుం
డనుటయు నటుచేసి వారలం దేమియుఁ గా
ననివారై యీతని వ్ర
చ్చిన యట్టులకాదె యేల చెనఁటిగఁ జంపన్. 53

వ. అనుచు నవ్విప్రు బంధముక్తునింజేసి నిజేచ్ఛం జనుమను
టయును. 54

క. క్రూరులచే విడివడి సుత
దారాదులఁ గలసి యతఁడు ధన్యుం డయ్యెం

జోరుఁడు వివేకమానస
చోరుఁడు నాకమున కరిగి సుఖియై యుండెన్. 55

క. అవివేకచరిత మట్టిది
సవివేకచరిత్ర మిట్టిచందం బగుటన్
సవివేకహీనుసంగతిఁ
దవులంగవల దాపదలకుఁ దప్పఁదలఁచినన్. 56

---

## అహిభేకోపాఖ్యానము.

ఉ. పూచినతీఁగెలన్ మధురభూరిఫలంబుల వ్రేఁగున న్మహీ
మోచినకొమ్మలుం గలిగి మూఁకలుగట్టినపోఁకమోకలన్
రాచిన వాల్మికంబులు దిరంపడి వర్ణనసేయనొప్పు విం
ధ్యాచలపార్శ్వకాననమనన్యవనీవిభవోపమానమై. 57

వ. అట్లయ్యరణ్యం బభిరామగమ్యం బై పరఁగునంత 58

క. తొల్లి యుగసంధి నొకతఱి
నెల్లెడఁ బొడవడఁగఁ దాప మెక్కుడుగా సం
ధిల్లె నొకవఱపు ప్రాణులు
తల్లడిలంగ నిడివి యగుచు ధరణి తలకన్. 59

వ. అక్కాలంబున: 60

సీ. పసిమి యెచ్చటలేక పాడగుటకుఁ దోడు
పాతాళమునదాఁకఁ బగిలె నేల

బిలములు వ్రయ్యలై నెలవులేమికిఁ దోడు
హీనజంతువులెల్ల నివికె నెడఁ
జండాతపముచేత నెండిపోకకుఁ దోడు
ద్రుమములఁ బెనుగాలి తుమ్మురు సేసె
నాఁకలి నీరువ ట్టనుచిచ్చునకుఁ దోడు
కార్చిచ్చు మృగములఁ గాల్పఁదొడఁగె
నాపదల మదనాపద లావహిల్లె
వట్టిపోయిన డొక్కలు వాము లయ్యె
నివురుబొగ్గుల ప్రోవులు నిఖిలదిశల
నధిక దుస్సహమయ్యె నయ్యడవియందు. 61

క. పరిపూర్ణోదకమై కడు
నిరవగు నొకకూపమున ననేకంబులు ద
ర్దురములు బహువర్ణంబులు
పరఁగు సుహృద్భ్రాతృపుత్రపౌత్రయుతము లై. 62

వ. ఇట్లున్నయం దమకు మహావేగుం డనునొకచక్కని
మండూకంబు రాజుగా నిలుపుకొనిసుఖంబుండునంత 63

క. ప్రియబంధు లెల్లవారును
లయమందినఁ దాను జాల లావఱి కంతా
శ్రయజీవనమై తిరిగెడు
భయదర్శక మనఁగ నొప్పు పా ముచ్చోటన్ 64

క. మండూకనినాదము విని
నిండినసంతసముతోడ నీ రుడనిచో
నుండ వివి యచట నుదకము
లుండఁగఁబోలు నని మేన నుమ్మనలారన్. 65

మ. కదియంజయ్యనవచ్చినాగమచటంగాంభీర్యసంపత్తికిం
గుదురై యుండెడునూయిఁగాంచిమదిఁగోర్కుల్నేఁడు నేకూఱ
బో|వుదునాత్మృష్ణబుభుక్షయిప్పుడవెసంబుత్తున్మహావగ్రహ
స్పద దుష్కాలదినంబులెల్లనిచటన్ సమ్యక్సుఖావాసినై

వ. అని యెంచి. 66

క. చెఱవెడలఁ దెఱవుఁగానక
దరినుండుచు లోననుండు దర్దురనాథుం
బరిమితపరిజనపరివృతు
నిరవున నున్నతనిఁ జూచి యి ట్లని పలికెన్. 67

శా. దేవా భేకకులాధినాథ కరుణాదృష్టి న్ననుం జూడవే
జీవంబుండదు నీరువట్టు కతనన్ శీఘ్రంబ నిం గొల్వఁగాఁ
ద్రోవ దిక్కునఁగాననేర మదిలో దుఃఖంబునం బ్రుంగెదన్
నీవారింగలయంగ రాఁబనిచిమన్నింపఁగ దేవేఁడెదన్ 68

క. మాపెద్ద లెఱుకసాలర
మీపెద్దల కెగ్గుసేసి మెలఁగుట యొల్ల
బాపికొనవలయు నను నీ
శ్రీపాదసమీప మిపుడు చేరిచికొనవే. 69

సీ. ఉరగసంఘమ్ములకుఁ గప్ప లోడుటెల్ల
నీవు పుట్టుకమునుఁ గాని నీప్రతాప
మెఱిఁగి రిఁక మిమ్ముఁ దొరయ రా వెఱవకుంద్రె
చారుతరమూర్తి మండూకచక్రవర్తి. 70

క. హనుమంతునిం ప్లవంగం
బని పిల్తురు నిన్నుఁ బిలుతు రాపేరనె యిం
ద్రుని హరి యందురు హరి యని
నినుఁ జెప్పుదు రనఁగ వినుతి నీకుం దగదే. 71

క. అని తన్ను నిట్లు వొగడిన
విని యొడ లుబ్బంగ భేకవిభుఁ డయ్యహికి
ట్లను నామంత్రులయనుమత
మున నిను రప్పింతు నిలువు ముదమున నచటన్. 72

చ. అని తనయిష్టమంత్రుల రయంబునఁబిల్వఁగఁబంచివారికి
ప్పని యెఱిఁగించిన న్వారమె పాములపొత్తుమనంగదీనికే
మని యొకఁడొప్పుకార్యము క్రియం దలపోసెద వన్న వెం
డియు! న్ననమున సర్పబాంధవము మానని యేలిక మో
ముఁచూచుచున్ 73

వ. స్వోతుం డనుదర్దురం బి ట్లనియె: 74

క. తనకు నెడరైన తఱి మా
లనికంటెం గీడువడు నలజ్జత నదివా

సిన యపుడ మఱచి కుజనుఁడు
దనుఁ బట్టపురాజుఁగాఁగఁ దలఁచు మనమునన్. 75

క. చెలిమి శిలాక్షర మెప్పుడు
నలుక జలాక్షరము సుజను లగువారలకుం
జెలిమి జలాక్షర మెప్పుడు
నలుక శిలాక్షరము కుజను లగువారలకున్. 76

వ. పిదపఁ గృష్ణరూపం బనుమండూకం బి ట్లనియె: 77

మ. అరయందుష్టజనుల్ స్వదుశ్చరణజాత్యంధుల్ నిజాచారధీ
గరిమాతిస్తుతివంతులాత్తఘనరత్నాగరూకాత్తకుల్
పరదోషేక్షణదివ్యచక్షు లితరప్రజ్ఞాప్రశంసానిరంతర
మౌనవ్రతు లన్యవిత్తహారణధ్యానక్రియానైపుణుల్.

క. చేరంగఁ దగని దుర్జనుఁ
జేరంగా నిచ్చ్రేని సేగియు నిడుమల్
కూరుదురు తొల్లి కాకము
సేరిన యంచలకు నైన చేటు వినమొకో. 79

క. అనవుడు మండూకేశుఁడు
విన మెన్నఁడు నంచ లేమివిధమునఁ గాకం
బునకు నిరవిచ్చె నెవ్విధ
మునఁ వానిం బిదపఁ గీడు పొందెం జెపుమా. 80

వ. అనిన యాకథవినుమనియాకృష్ణరూపియిట్లనియె: 81

సీ. ఒకపర్వతముమీఁద నొప్పడు కొలనిలో
నంచలు కొన్ని యిచ్ఛానువృత్తిఁ
బగలెల్ల విహరించి భానుఁడు గ్రుంకంగఁ
బాపాత్ములకుఁ జేరఁ బ్రాఁక రాని
యున్నతోన్నతమగు నొకగండశిలయందు
రేలెల్ల సుఖలీలఁ గ్రాలుచుండు
నట్లుండఁ దద్గ్రహణాపేక్ష నొకబోయ
తెంకిప ట్టరసియుఁ దేఱిచూడ
లేక యరిగెను నొకనాఁడు కాక మొకటి
ప్రొద్దు గ్రుంకిన నచటుగాఁ బోయిపోయి
ఖగసునాదము విని వాని గదియవచ్చి
యుండుటయుఁ దానిఁ గని హంసయూథ మెల్ల 82

ఉ. ఎచ్చటనుండి యెచ్చటికి నేగెద వేమిప్రయోజనార్థమై
యిచ్చట నిల్చి తీ వనిన నేఱి తినంజనికుక్షి నిండఁగాఁ
జెచ్చెరనుక్కపట్టునకుఁ జేరఁగఁ బోయెడిప్రొద్దులేమి నా
కిచ్చటనుండఁగావలసెనిట్టిదినావిథమంచుఁ జెప్పినన్. 83

క. అగుఁగాక నిలువు మని హం
సగణం బంతయును బలుక సంకటపడుచున్
సుగుణుఁడు మతిమంతుం డను
తగవెఱిఁగిన యంచ యొకటి దా ని ట్లనియెన్. 84

గీ. సబము నెంగిల్లు దీనిభోజనము క్రూర
మిట్టి యెగ్గులు వేయును నేల చెప్ప
ఖగములందుఁ జండాలుఁడు కాక మనుట
కడుఁ బ్రసిద్ధంబుఁ గాదె యానోడువు వినరె. 85

క. వల దీరే యిది మనకడ
నిలిచినఁ గీడొందు మనల నేఁడెల్లిటిలో
పలఁ జేరకున్నఁ గాలము
తలనైనను జేరు నింతతథ్యము నుండీ. 86

వ. అనుటయుఁ గార్యం బెఱుఁగని తరుణమరాళములం
గొన్ని యమ్మతిమంతు నుద్దేశించి: 87

గీ. ఇంతవద్దు వాద మీకాకి యొక్కటి
యొక్కరాతి రిచట నున్నమాత్ర
గీడు సేరుననుచుఁ గీనువగొట్టుట
యిద్ది వెఱపుగాక యెఱుక యగునె. 88

క. పెక్కులు బుద్ధులు గఱచిన
నెక్కుడు భయ మనుట నిక్క మింక బహూక్తుల్
తక్కు మిదియుఁ గా కిది తా
నెక్కడికిం బోవు దిమిర మిప్పుడు రాఁగాన్. 89

క. అని పలికి దాని నుండం
బనిచి యభీష్టంబు లైనఫలములచే భో

జన మొనరింపఁగ నుండఁగఁ
దనయిమ్ముల వాయసంబు దగనివసించెన్ 90

వ. ఇట్లువసియించి: 91

గీ. అచట రెట్టఁబెట్టి యర్కోదయముగాఁగఁ
దడయ కరిగె నంత దానిరెట్ట
శిలలసంధిఁ బొంద మొలచె నం దొకవట
భూజఫలములోని బీజ ముండి. 92

మ. అదినానాఁటికిఁబేర్చి శాఖలవిహాయస్స్పర్శమైయుండఁగా
బదియేండ్లుం జనునంత నూడలుకడుంబల్పారివర్ధిల్లుచుం
గదిసెన్వచ్చియధిత్యకాతలమువంకన్నాఁదాఁబ్రాకియుత్య
దితాసంది కిరాతుఁడొగ్గెనురులాభూజంబునందెల్లెడన్.

చ. ఉరులుకుజంబునంగలయనొగ్గినిషాదుఁడుచన్న మీఁదభా
స్కరుఁడపరాద్రిఁ జేరె జలజాతవనంబులఁ గ్రీడమానివ
త్వరగతిమీఁటమీఁదికిసితచ్ఛదముల్ చనుదెంచియాఁగివాగు
రికలఁజిక్కియున్కియునుగుందుతఁటి న్మతిమంతుఁడిట్లనున్.

మ. మనకీపాటులువచ్చెఁజూచితిరెనామాటల్వృథాహంకృతి
న్వినఁగానొల్లక యల్లరాత్రియిచట న్నీరెల్లనాడాడియుం
చిన యాకాకము రెట్టలో మొలిచి హెచ్చెం జూవె
యీమఱ్ఱిడిగ్గినయూయూడలఁ బ్రాఁకి కాఁదె మన కొగ్గం
బోయఁ డీ జాలమున్ 95

క. తగువాని పలుకు సేయుట
తగ వెఱుఁగక యడచివడమి తమవారలతో

సగుణత్వము గాను టుత్తను
లగుణము లటుగామి యరయ నధమగుణంబుల్.

చ. అనవుడు నంచలిట్లను మహాత్మ భవత్ప్రతిభావిలంఘనం
బనమనకిట్టి కీడిపుడు పుట్టె నుపాయముకల్గి దీనిఁ బా
పనలవియేనిఁ బాపి హితబంధుల నిన్నునుగాచికొమ్ము నీ
పనిచినయట్లచేసిభటభావముఁబొందెద మెల్లవారమున్.

వ. అనఁటయు మతిమంతుం డిట్లనియె: 98

క. తమలో నన్యోన్యవశ
త్వము గలిగిన బంధు లాపదలనెల్లఁ నుపా
యముమైఁ బాతురు నిక్కము
శమతంబులు గరుడబాధ గడచినభంగిన్ 99

వ. కాన భయంబు వలవ దక్కథవినుం డని యిట్లనియె.

క. అంబుధితీరంబునఁ గూ
ర్మంబులు చరియించుచుండుఁ బ్రతిదినమును వా
సింబట్టి తనకు నాహా
రంబుగఁ గొనుచుండుఁ బక్షిరాజుగ్రుండై. 101

వ. అట్లు సెల్లుచుండ నొక్కనాఁడు: 102

చ. వననిధినీట నిల్చి ఖగవల్లభుతో నొకకూర్మముఖ్యుఁ డి
ట్లనియె మదీయబంధునివహంబులు దేవరవాతఁ ద్రుంగనే
న నిలిచినాఁడ నిప్పటికి నాకుఁ దొలంగినఁ బోదు నీకునా

కు నొకటి పన్నిదంబు సమకూఱును కొలము కాని
చెప్పుమా. 103

క. అనుటయు నవ్వుచు వనితా
తనయుం డది యేమిపన్నిదము సెప్పవయా
యనవుడు నలుగక చిత్తం
బున నించుక యవధరింపుము మహావిహగా. 104

మ. ఉడువీథిన్ వెసనీవు వాలి జవసత్త్వోత్సాహ యంభో
ధిలోఁ గడువం బాఱెద నన్ను నేనుమిగులం గాఁ జాలి
నట్లైన నెన్నఁడు భక్షింపకు మమ్ము నోడినటులైనం
గాకులంబెల్ల నెప్పుడు నాహారము గొమ్ము నీవు వినతా
పుత్త్రా మహాధార్మికా. 105

వ. ఇవ్విధంబు నేయుం దలంపు గలిగెనేని నొక్కనాఁడిచ
టికి విజయంచేయుం డనిన సుపర్ణుం డట్లు చేయుదు
నని యొడంబడి పోయిన: 106

క. తనచుట్టంబుల నందఱ
ననువుగ నొకచోటఁ గూర్చి యాకార్యము తా
ర్క్ష్యునితోఁ దా నొడఁబడి వ
చ్చినచందము వారితోడఁ జెప్పుడు వారున్. 107

క. నినుఁ గడచినమతిమంతులు
మనలోపలఁ గలరె పంపు మము సేపని రై

నను జేయుదు మనవుడు నది
మన మలరఁగ జెపుదు వినుఁడు మన మందఱిమున్.

క. ఆమఱి యొడఁ బడి పదిగా
సాముద్రతటంబునీరఁ జని యుండి ఖగ
స్వామి పఱవంగ నాతని
కాముండటివాఁడు చూపునది పొడ వచటన్. 109

వ. అని యోజ చేసికొని విహగవల్లభుతోడఁ దాను మాట
లాడిన యొడన యాకచ్ఛపంబు నిలిచె నచ్చట మొద
లుకొని యనేకయోజనంబులు దాఁకఁ దక్కినవియు
వట్ల యుండ మఱునాఁడు సనుదెంచి: 110

క. గరుడుం డవ్వలనికి స
త్వరగతిఁ గూర్మంబుఁ బిలిచి వారిధిపై నం
బరవీథిఁ బెద్దయును ద
వ్వరుగుచు నది చిక్కఁ నోపునని చీరుటయున్. 111

క. ఓయని పలుకుచు ముందటఁ
దోయధిలోఁ గచ్ఛపంబు దోఁచిన మఱియున్
వాయుగతిఁ బఱచి చీరిన
నాయొడ నగ్రమునఁ గమఠ మల్లన నెగసెన్. 112

వ. అవ్విధంబుఁ గని యచ్చెరు వొందుచు: 113

క. అందుండి మగుడఁ బలుచుచు
ముందటి యట్లట్ల పిలువ ముందఱ నంతం
తం దోఁచుచు నవి పిలుందులు
వుుందఱఁగాఁ జేసి పక్షిముఖ్యునిఁ గలిచెన్. 114

క. అతఁడు తన రౌూటమిని ల
జ్జితుఁడై మీా కెందు నెగ్గుసేయం బ్రమత
స్థితి నిలువుఁ డనుచుఁ బోయిన
నతిపంతోషమునఁ గచ్ఛపావళి యుండెన్.115

* * * *

———

# 5 మార్కండేయపురాణము

——:o:——

హరిశ్చంద్రచరిత్రము.

తే. నీవు నుడివిననెల నిండె నేఁటితోడ
నేది మాసొమ్ము తెమ్ము మహీతలేశ
యొసఁగిన నింకను దినమునం దర్ధమున్న
యది సహింపు మునీంద్రి నీవంతవాఁక. 1

క. అనవుడు నాఁగాకని య
మ్మునిపతి వోవుటయు రాజముఖ్యుఁడు చేతో
వననిధి పిండలివండుగ
ఘనచింతామందరంబు గలపఁగ మదిలోన. 2

సీ. ఈమునీంద్రున కర్థ మీరెండుజాముల
కెక్కడ సవరింతు నెందుఁ జొత్తు
నెడరు దీర్పఁగ బంధు లెచ్చటఁ గల రిప్పు
డెవ్వారి నడుగుదు హీనవృత్తి
నెట్లు దట్టుదుఁ బ్రాణ మేదెన పోదు నే
నెయ్యెడ నడఁగుదు నింక నకట
నెలమితో పప్రున కిచ్చెద నని పల్కి
యీకున్నఁ గ్రిమిజన్మ మిపుడు వచ్చు

నేమి సేయుదు ననుచు నరేంద్రుఁ డలఁత
నెరియుచును మోము వ్రాల్చిన నింతి యేడ్పు
టెలుఁగుతోఁ గన్నుఁగవ నశ్రులొలుక జీవి
తేశుఁ గనుఁగొని సుదతి తా నిట్టు లనియె. 3

తే. ధీరమతి నీవు నిట్లు చింతింపఁ దగునె
సత్యపాలన మొనరింపు సత్యహీనుఁ
డైన పురుషు దేహము దా శ్మశానతుల్య
మధిప మేటిధర్మంబు సత్యంబ యండ్రు. 4

క. ఒనరఁగ హయమేధము లే
డొనరించితి రాజసూయ ముజ్జ్వలవిభవ
మునఁ జేసితి సంతాన
మును బడసితి సుకృతి నీవు పుణ్యచరిత్రా. 5

వ. అనుచు నిట్టూర్పు లందంద సందడింపఁ గన్నీరు గడ లుకొనిన స్గద్గదికానిరుద్ధకంఠి యగుచు డెందంబున నుడివడుతలం పెట్టకేలకు వెలువరించుకొని యమ్మహా దేవి యి ట్లనియె.

తే. పుత్రలబ్ధిఁ గృతార్థులు పొలుతు రుర్విఁ
గాన నన్నిప్పు డమ్మి యకౌశికునకు
ధనము వెట్టి సత్యమ్మును మనిపికొనుము
బొంకుకంటెను జావైనఁ బొంక మనఘ. 7

క. అని చూచుచుఁ గొలఁదిమీఱఁ
డిన క్రియ సతి పలుకుటయును డెంద మవిసి య
జ్జనపతి పిడు గడిచినవిధ
మున మేదిని ముడిఁగి పడియె మూర్ఛాగతుఁ డై. 8

చ. పడి తెలివొంది లేచిపొరి బాష్పజలంబులు మేనుగప్పఁగాఁ
బడఁతుకఁ జూచినీవు మృదుభాషిణివక్కట యింతకోర్చిన
న్నడజడిపెట్టుమాటయిటిలాడఁగఁగూడు నెహోయ వాచ్యము
ల్విడువులతొంగియంచుఁబటు వేదనఁ గ్రమ్మఱవ్రాలె మేదినిన్ 9

మ. పతిమూర్ఛాగతుఁ డైనఁ జూచిసతి బాష్పచ్ఛన్నవక్త్రాబ్జ
యై। ధృతి యొక్కింతయు లేక వావిడిచి యారాత్రి న్హా
మహారాజ హా।చతురంభోధిపరీతభూభువనభాస్వద్బా
హాఖడ్గాగ్రచూ। ర్ణితవీరారిశరీరభూమి తధరిత్రీభాగహా
వల్లభా. 10

తే. హా హరిశ్చంద్ర కనకపర్యంకతలము
నందుఁ బొందు నీయంగమే యకట చెనఁటి
నేలఁ గూలినయది నేఁడు నీచదైవ
మిట్టి దశ దెచ్చెనే దివిజేంద్రభోగ. 11

వ. అని పిలపించుచు నమ్మహాదేవి భర్తృదుఃఖభారపీడిత
యై సొలసి నేలవ్రాలె నట్లు తల్లియుఁ దండ్రియు నెవ్వా
రు దిక్కు లేక నిశ్చేష్టితులై పడియున్నం గనుంగొని
తదీయనందనుం డగు బాలుండు: 12

క. కన్నుల బాష్పము లురలఁగ
నన్నరవరుఁ జేరనరిగి యతిదైన్యముతో
నన్నన్న యాఁక లయ్యెడి
నన్నము నాకిపుడు పెట్టు మని యడుగుటయున్. 13

ఆ. కాలకల్పుఁ డైనకౌశికుఁ డేతెంచి
శిశిరవారి వారి సేద దేర్చి
యేల నేలఁబడఁగ లేలెమ్ము నృప యాఁగ
రానియప్పు వగల నీనకున్నె. 14

క. అని యూఱడించి యేదీ
ధనము ధరణీనాథ ధర్మతాత్పర్యము నీ
మనమునఁ గలదేని రయం
బునఁ బెట్టుము సత్యనిష్ఠఁ బొందుము నెమ్మిన్. 15

క. సత్యమున నున్న దీధర
సత్యమున వెలుంగుఁ దరణి సత్యముననె తా
నిత్యమయి స్వర్గ మమరును
సత్యము ధర్మములలోఁ బ్రశస్తం బనఘా. 16

తే. వినుము తులనిడి యెత్తుచో వేయితురగ
మేధములకంటె సత్యంబు మిగులఁ దూఁగెఁ
గాన సత్యయుక్తుండవు గమ్ము సొమ్ము
దెమ్ము మమ్ము రమ్మనకు నీదెసకు నింక. 17

ఉ. క్రూరుఁడ వీవహార్యుఁడవుకొంకవుబొంకఁగనిట్టినీమెడం
గారణమేమిమాకునధిక ప్రియవాక్యములాడుచుండనం
భోరుహమిత్రుఁడస్తగిరిఁబొందెడుఁబైకముచక్కఁబెట్ట కి
ట్లూరకయున్ననిత్తుఁగడునుగ్రపుశాపమునీకుభూవరా.

చ. అనిముని యేగినంగడుభయమ్మునఁ దల్లడమంది నాఁథు
జూచి నరవరేణ్య నన్ను నెడసేయక యమ్మి ఋణ
మ్ము దీర్పు కో। ధనుఁ డగుచున్న కౌశికునిదారుణశా
పము పాలుగాకుమీ। యని పలుమాఱు వేఁడుకొను
నంగనమాటకు రాజు పొక్కుచున్. 19

క. మనమున రోఁతయు నొడఁబా
టును బెనఁగొని మిక్కుటంపు డోలాయనముం
బెనుపఁగ ననృతభయంబును
మునిశాపభయంబు వనటముంప వికలుఁడై. 20

ఆ. ఎట్టకేల కమ్మహీవిభుండు మనముఁ
దెగువఁచేసి మగువ మొగముఁ జూచి
యకట నిర్దయాత్ములైననృశంసులఁ
బోల కేల నాకుఁ బోవవచ్చు. 21

క. నిను నమ్ముకొనియెడం బడ
వనరుహదళనేత్ర యనుచు వారాణసి చొ
చ్చి నరేంద్రుఁడు బాష్పంబులు
గనుఁగవ వెల్లిగొన నెలుఁగు గడలుకొనంగన్. 22

సీ. ఓపురజనులార నాపత్ని నమ్మెద
నే దాసిగా వెల యెఱిఁగి పెట్టి
కొనుఁడు న న్నెవ్వఁడ వని యడిగెద రేని
నే నృశంసుండను దానవుండ
నతిపాపకర్ముఁడ నాలినమ్ముకొనంగ
నరుగుదెంచిన కఠినాత్మకుండ
ననుచుండ నొక్క బ్రాహ్మణవృద్ధు చనుదెంచి
మత్ప్రియాంగన సుకుమారి పనికిఁ
జాల దిచ్చెదేని చయ్యన వెలఁ జెప్పు
వరవుడెట్లు మాకు వలయు ననిన
విభుఁడు విపులదుఃఖవేదనఁ బలుకనో
రాడకున్న నంత నాద్విజుండు. 23

ఆ. తగినయంతధనము దాన యన్నరనాథు
వల్కలమున ముడిచివైచి యొడిసి
పెలుచ నాలతాంగి పెడఁబాయఁ దలపట్టి
యీడ్చె నీడ్వ నేడ్చు టెలుఁగుఁజోడ. 24

ఆ. విడువవయ్య తండ్రి తడయక వచ్చెద
వీఁడె నన్నుఁ జూచి వెగచి వెగచి
కొడుకు దద్ద వెగడుపడి యేడ్చుచున్నాఁడు
బుజ్జగింతు ననుచుఁ బుత్త్రుఁ గాంచి. 25

క. అన్నన్న నన్ను ముట్టకు
మన్న నృపతినూజ దాసి నశుచి ననుచుఁ బైఁ
గన్నీరు వెల్లిగొనఁ గా
నున్న జననికొంగు బాలుఁ డుడుగక పట్టెఁ. 26

తే. పట్టి విడువక యేడ్చినఁ బట్టెఁ దల్లి
పెట్టి పోఁజాల కరిలి బెద్ద యడలి
విప్రుఁ గనుఁగొని వీనిని విలువవయ్య
గోవుతోడన వత్సము గొనువిధమున.

వ. అని యద్దేవి యత్యంతదీనావనతవదనయై ప్రార్థించిన నతండు శాస్త్రవిదులు పురుషునకుఁ బెక్కువేలుమాడలు నంగనకు నర్ధంబునుం జెప్పుదురు గావున నిక్కుమారునకు వేనవేలుమాడలు గొను మని యన్నరపతి కిచ్చి యయ్యిరువుర నీడ్చుకొని పోవం గనుంగొని నిట్టూర్పు లందంద సందడింప విపులవేదనాదూయమానమానసుం డగుచు నమ్మానవేంద్రుండు. 28

చ. అనిలుఁడు నర్కుఁడు న్నశియు నైనను గానరు మున్నుఁ దన్ననత్యనుపమరాజ్యభోగమహిమాతిశయంబుననట్టి కాంత నేఁడినకులరత్నమై వెలుఁగు నిట్టిసుతుండును దాను నాకతంబున వరవృందనంబునకుఁ బోయెనె యే గతిఁ బోదు దైవమా. 29

మ. అని దుఃఖింపఁగఁ గౌశికుం డచటి కుద్యద్వేగుఁడై
వచ్చినన్। జననాథుం డిదె సొమ్ముకొమ్మనిన నాస్వల్పా
ర్థముం జూచి కోపనుఁడై యంతట దక్షిణాధనము సం
పన్నంబు గాఁ జేసితే। నను గారించెద వేల యింకఁ
దడవైనన్ శాప మిత్తుం జుమీ. 30

ఆ. ప్రొద్దు జాముతక్కు పోయి నే వచ్చెద
వేయుఁ జెప్పనేల వేగఁ గొఱఁతె
ధనము పెట్టవలయు నని యప్పు డిచ్చిన
ధనము గొని యతండు సనియెఁ జనిన. 31

ఉ. ఆనరనాథుఁ డప్పుడు భయమ్మును శోకము నగ్గలింపఁ
గాఁ।దా నెద నాత్మవిక్రయము దక్క ధనంబున కేయు
పాయముం।గానక నిశ్చయించి యధికధ్వని నిట్లను
నన్ను నమ్మెద। న్మానుగ నెవ్వఁడైనను ధనం బిటఁ దెండు
గొనుండు నావుడున్. 32

వ. అయ్యవసరంబున ధర్ముండు రయంబున. 33

మ. నిడుమోముం గుఱుగేలు గుండకడుపు న్నీలత్వము
న్నిట్టలు।న్గడుదీర్ఘంబులు నైనదంతములు పింగశ్మశ్రుకేశం
బులు। న్జెడుగుంగంపును గల్గి హేయ మగునీచీభావముం
దాల్చి తా।జడకల్గట్టి నికృష్టయష్టికరుఁడై చండాలవే
షంబుతోన్. 34

క. ఇలఁగోలఁ దట్టుచు న్నం
బళి సంబళి యనుచుఁ గ్రందుపడుజనములకు
న్దొలఁగుచు నొదుఁగుచు నాభూ
తలపతికడ కరుగుదెంచి తా నిట్లనియెన్. 35

సీ. నేను జండాలుఁడ నృపవర పురమున
వీరవిఖ్యాతుఁడ ధీర వినుమ
చంపఁగఁ దగువారిఁ జంపెడివాఁడఁ జ
చ్చినవారి మొగముల చీర లెపుడుఁ
గొనియెడివాఁడ నెక్కుడు సొమ్ము గలవాఁడ
నెంతయర్థంబైన నిచ్చి నిన్ను
విలిచెదఁ జెప్పుమా వెల యన్న నారాజు
మాలను సేవించి మనుటకంటెఁ
గౌశికోగ్రశాపాగ్నిచేఁ గ్రాఁగిపోవు
టైన మేలని తలఁప నమ్మౌని యరుగు
దెంచి నృపుఁ జూచి నాయప్పుదీర్పరాదె
యధికధనము నీ కిచ్చు వీఁడనిన విభుఁడు. 36

క. ఇనవంశంబునఁ బుట్టిన
మనుజేంద్రుండ నఖిలలోకమాన్యుఁడఁ గొఱమా
లినమాలని నకట తపో
ధనసత్తమ యేను గొలువఁ దగునే చెపుమా. 37

మ. కరుణం జూడుము కావు మిప్పుడు త్రిలోకస్తుత్య చం
డాల సం।కరదోషంబును బొందకుండఁగ నను న్గైకొ
మ్ము నీబంటుగాఁ। బరిశిష్టం బగుసొమ్ము నాకు వెలగా భా
వింపు మంచు న్మునీశ్వరుపాదంబులు వట్టెఁ జేతుల హ
రిశ్చంద్రుండు దైన్యంబునన్. 38

ఉ. అక్కట యేమి సెప్పఁ గఠినాత్మకుఁ డమ్ముని యిట్టు లా
ర్తుఁడై। మ్రొక్కినరాజుఁగన్గొని యమోఘముగా నను
గొల్చి బంటవై। దక్కితిగాన మాలనికి దక్కఁగనమ్మితి
నేను నిన్ను వీఁ। డక్కఱ దీఱ నిచ్చు నొకయద్భుతవి
త్తము నాకు నావుడున్. 39

ఉ. మాలఁడు వొంగి యమ్మునికి మానుగ నర్థన మిచ్చి
పట్టె భూ।పాలునినంటఁగట్టె యకృపామతిఁ గొంకక చే
తికోలఁ బైతో। లెగయంగవేసి వెసఁ దోడ్కొని ప
ల్లెకుఁ బోయె నేరికిం। గాలవశంబునం గలుగు కర్మఫలం
బులు దప్పనేర్చునే. 40

వ. ఇట్లమ్మహారాజు కాలవశంబునం జండాలపక్కణగతుం
డై దురంతదుఃఖార్ణవంబునం దేలుచుం దనమనంబున
నిజజీవితేశ్వరిం దలంచి. 41

క. బాలుని దీనంబగు మో
మాలోకించుచును శైబ్య యత్యంతార్తిం

దూలి తనదాస్య ముడుపం
జాలుదు నని నన్నుఁ దలఁచు సతతము నకటా! 42

క. నాపా టెఱుంగ దింతయు
నాపుత్త్రుఁడు ననుచుఁ బొక్కు నత్యంతపరీ
తాపంబు నొందు మాలని
చేపడుటకుఁ బేరుఁ బెంపుఁ జెడిపోవుటకున్. 43

వ. ఇవ్విధంబున హరిశ్చంద్రుండు నిరంతరవేదనానలదంద
హ్యమానమానసుం డగుచుండ నొక్కనాఁ డతనితో
నాచండాలుండు నీకుఁ గాటికాపరితనం బిచ్చితి నందుఁ
బుట్టినధనంబు నందు రాజునకు నాఱవభాగంబును నా
కుమూఁడుపాళ్ళును బెట్టి నీవు రెండంశంబులు గొని
బ్రతుకు మని నియమించి పంచిన మహాప్రసాదం బని
వారణాసీపురంబు దక్షిణంబునకుం జని. 44

సీ. శవదహనోద్భూతసంతతధూమంబు
బహువిధదుర్గంధబంధురంబు
కేశచితాభస్మకీకసకీర్ణంబు
బేతాళడాకినీభూతచితము
వాయసగృధ్రగోమాయుకలకలంబు
మేదోవసామాంసమేదురంబు
మృతబంధుశోకార్తసతతహాహారవ
మమితకపాలపిండాన్నసాంద్ర

ముజ్జ్వలాగ్ని శిఖావృతవ్యోమభాగ
మగుచు నత్యంతవిస్తార మైనభీక
రశ్మశానమ్ము గని యద్ధరావిభుండు
దాని దక్షిణయంగఁ జని యందుఁ దా వసించె. 45

ఉ. కాలియపట్టినట్లు గడుఁ గంది కృశుండయి పీడి వెంద్రుక
ల్దూలఁగ లాంఛనధ్వజముతో లగుడంబు తగన్ధరించి ప్రే
తాలయ మెల్లఁ ద్రిమ్మరుచు నాయతు లన్నియుఁగొంచు
రాజు పెన్నాలతనంబు నొందెఁ గాఁబన్నూలిన దైవముచె
య్దిని నక్కటా. 46

సీ. ప్రాణంబుతోడ జన్మాంతరంబును బొందె
నిట్లు హరిశ్చంద్రుఁ డేమిచెప్పఁ
బీనుంగులకుఁ బెట్టు పిండము ల్గుడుచుచు
మేదోవసామాంస మిళితపంక
ముల నెప్పుడును బ్రుంగు చొలికి బూడిదలలోఁ
బొరలుచుఁ గట్టిన బొంత గప్పు
టొడవిదుర్గంధంబు నుడియంగ వడిని జు
గుప్సరూపంబు గైకొన్న మాడ్కి
నతినికృష్టవృత్తి నార్తుఁడై సుతసతీ
సుహృదమాత్యబంధుసుఖవియోగ
వేదనానలమున వేఁగుచు నమ్మెయి
నుండ నెలలు పదియు రెండు నిండె. 47

వ. అంత నొక్కనాఁ డమ్మహీపతి పరేతనికేతనంబున ని ద్రించి యత్యద్భుతం బైనకల గాంచె నెట్లనినఁ దాను జండాలికాగర్భంబున నుద్భవించి సప్తవర్ష వయస్కుండై యొక్క శ్మశానంబున మృతసంస్కారమాల్యాహరణా ధికారంబున నుండం గొండఱు విప్రు లొక్క శవంబు గొని వచ్చి దహనవేతనంబునకై తనచేతం బరాభూతి నొంది కోపించి ఘోరనరకంబునం బడు మని శపించిన నప్పుడు కాలకింకరులు దన్నుం బట్టుకొని పోయి తప్త సికతానలప్రదేశంబుల నడిచియుఁ బొడిచియుఁ గాల్చి యుఁ బ్రేల్చియుఁ గండలు గోసియు నూనియ నుడికిం చియుఁ బురీషకూపంబుల ముంచియు ననేకక్రూరదండం బులు దండింపం బూయశోణితంబులు ద్రావుచు నొక్కొ క్కదినంబు శతవత్సరంబులుగా వత్సరద్వయం బధిక దుఃఖంబు లనుభవించి నారకభువోత్సార్యమాణుం డై క్రమ్మఱ మహీతలంబునం బడి, ఖర, శునక, హస్తి, వానర, చ్ఛాగ, బిడాల, కంక, గృధ్ర, మత్స్య, కూర్మాది నానాకుయోనులం బుట్టి సార్థహాయనంబు తీవ్రవేదనల పాలై యెప్పటిరాజస్థితి వడసి జూదంబున నాలిని గొ డుకును రాజ్యంబును గోలుపడి యేకాకియై యడవుల కరిగి సింహంబు బారిం బాటి శరభంబుచేత భక్షితుఁ

డై వానిచేత నతిపీడితుం డగుచు భార్యానందనులం దలంచి వందురి తిరుగుచు నొక్కయెడ నయ్యిరువురుఁ దమ్ము రక్షింపు మని తన్నుం బేర్కొని పిలుచునెలుంగులు విని డాయంబోయి వారలం గానక పరిభ్రమించుచుండఁ బదియేనుదివసంబులు గొఱంతగఁ బండ్రెండేడులు నిండినతఱి విశ్వామిత్రుచే నంతవృత్తాంతంబు నెఱింగి జముండు తనకడకు రప్పించి యిదియెల్లఁ గౌశికరోషంబున నయ్యె దానం జేసి భవన్నందనుండు మృత్యుగతుండగుం బదంపడి పరమశుభంబు గలుగుదుఃఖశేషంబు గుడువ మనుష్యలోకంబునకుం బొమ్మని త్రోపించిన నంతరిక్షంబున నుండి నేలం గూలినవాఁడై బిట్టు మేల్కాంచి. 48

క. కడుభీతియు బెగ్గలమును
వడరఁగ నిది యొక్కకల మహాద్భుత మేని
యియ్యేడుమలు పండ్రెండేఁడులు
పడితినొ కలయో నిజంబొ భ్రమయో యకటా. 49

క. ఈదుఃఖము సుఖ మయ్యెడు
నా దుఃఖములకును నగ్గ మైతిమి విధిచే
నీదుస్స్వప్నము నెపమున
నీదుర్దశకంటె నింక నేదెస యగునో. 50

గీ. అనుచు నెంతయుఁ దలరి యమ్మనుజవిభుఁడు
మోడ్పుఁగేలు శిరంబున మోపి వేల్పు
లార యెప్పుడు నేకీడు చేరకుండఁ
గరుణ ననుఁ బుత్రు నింతిని గావరయ్య. 51
క. అని పలికి నృపతి శవవే
తనకారణముసను నంత దలఁపుసు జెడి భా
ర్యను బుత్రు మఱచి ప్రేతస
దనసంచరణంబునందుఁ దత్పరుఁ డయ్యెన్. 52
వ. అంతనమ్మహీవల్లభు వల్లభ యొక్కనాఁడు: 53
చ. ఉరగముచేతఁ జచ్చిన తనూద్భవునిం గొని శోకవేదనా
పరవశయు న్వికీర్ణకచభారయు నుద్గతబాష్పపూరయు
న్గరతలతాడితాస్యయును గద్గదికావికలార్తనాదయు
న్జరణవిపర్యయాపగతసత్వరయానయు నైపొరింబొరిన్ 54
వ. ఏడ్చుచుం బరేతనికేతసంబున కేతెంచి యక్కుమారు
నొక్కయెడ నిడి కూర్చుండి: 55
ఉ. బోరనఁ బొంగి శోకరసపూరము నిర్భరబాష్పపూరము
ల్వారక కన్గవం దొరఁగ వాతెఱలాలలు గ్రమ్మ దేరహా
హారవము ల్సెలంగ విరియంబడి వేనలిధూళిఁబ్రుంగ న
క్షూరిమిపట్టిఁ బేర్కొనుచుఁ గోమలి మేదినిఁ జేతు
లూఁదుచున్ 56

సీ. బహువిధంబులఁ బ్రలాపం బొనర్చుచు నేడ్చు
సతియేడ్పు విని డాయఁజని విభుండు
కార్చిచ్చు సోఁకినఁ గంది మ్లానత్వంబుఁ
బ్రాపించు దీవియరూపునొంది
యున్నట్టి వనితఁ దదుత్సంగమున నున్న
యహివిషవ్యపగతప్రాణుఁ డైన
సూనునిఁ జూచి యించుకయు నెఱుంగక
యబ్బాలు శుభలక్షణావలులకుఁ
జోద్యపడి యేనరేంద్రునిసుతుఁడొ వీఁడు
కాలుఁ డెటుమ్రింగె నో వీనిఁ గరుణమాలి
యనుచు మదిలోనఁ దలఁచి యాఘనుఁడు లోహి
తాస్యుఁ డింతకు నింతప్రాయంపువాఁడు. 57

తే. వాఁడు గాఁడుగదా బలవంతుఁ డైన
యంతకుని బారిఁబడి యిటు లైనవాఁడు
నాఁగ నద్దేవి మఱియు నానావిధములఁ
గొడుకుఁ బనవుచు నాథుఁ బేర్కొనుచు నడలి. 58

క. అక్కట దైవము రాజ్యముఁ
ద్రెక్కొని యాలిం దనూజుఁ దెగనమ్మంగా
నెక్కొలిపి హరిశ్చంద్రుని
నిక్కడఁ గాడ్పఱిచె నింక నేగతిఁ బోదున్. 59

చ. అనిపలుకన్విభుండువినియప్పుడుదామదివారల న్నిజాం
గనయుసుతుండుగానెఱిఁగిగ్రక్కునఁజేష్టయడంగి కూలెనే
లనతనినాథుఁగానెఱిఁగిలాలలువా దొరఁగంగఁ దీవ్రరో
దన మొనరించుచుం బడియెఁ దామరసానన మూర్ఛ
గప్పినన్. 60

వ. ఇట్లు మూర్ఛిల్లి యిరువురు గొంతవడికి నొక్కటఁ దెలి
వొంది రంత నన్నరేంద్రుండు నందనుం గనుంగొని:61

చ. అలరుమొగంబుతోడఁ గడునర్థిలినాకెదురేఁగరావు చే
తులుపచరించుచుందనువుధూళిమెయిం దొరయంగనేల
న। న్నెలమినిగాఁగిలించుకొన వెంతయుఁ దీపెసలారమం
జులో। క్తుల చవి యేల నా చెవులకుంజవిఁజూపవు నీవు
పుత్రకా. 62

చ. అనుచుఁ దనూజు నెత్తికొని యక్కునఁ, జక్కఁగఁ జే
ర్చి మోము మోమున గదియించి బాష్పజలముల్పొ
రిఁ బెల్లుగ నించి యేడ్చు హా। యని యకటా కుమార
తెగనమ్మితిఁ శాపముచేసి చీరయ। మ్మినయటు లిట్లు ని
న్నేదకి మ్రింగునె దైవము క్రూరసర్ప మై. 63

క. నీ విటుగాఁ జూచియు నా
జీవ మెడల దున్న యపుడ చిత్తమ్మున మో
హావేశము తండ్రులకు స్వ
భావము సు మ్మిట్లు సుతులపై సుగుణనిధీ. 64

తే. నెఱయ నర్రిలి నెనయు నీనెమ్మొగంబు
ఘనభుజంగవిషవ్యాప్తి గాజువాఱి
రాహుకబళితరోహిణీరమణు మాడ్కి
నుండఁ గనుఁగొని యే నెట్లు మండుఁ గుఱ్ఱ 65

వ. అనుచు నత్యంతశోకాగ్ని సంతప్తుండై మహీతలంబు
నం బడిన నద్దేవి కొడుకువలని శోకంబు విడిచి జీవితే
శ్వరు జుగుప్సితం బైన చండాలభావంబుఁ జూచి విస్మ
యంబు ననుతాపంబును దైన్యంబునుగా నిట్లనియె. 65

తే. పొడువు నిడుదయునై కడుఁ బొలుచు నితని
ముక్కు తుదయంతయును గడు నొక్కువడియెఁ
గుసుమముకుళసన్నిభరదాంకురము లింత
కంది యొన్వోడునే, దైవఘటన యకట. 66

క. దేవసమానుండగునీ
భూవిభునకు సకలరాజపుంగవునకు ని
ట్లేవపుఁ జండాలత్వము
గావించిన దైవమునకుఁ గరుణయుఁ గలదే. 67

క. కరితురగరథపదాతులు
గర మమర సితాతపత్రకాంచనమయచా
మరములు పొడగాన మహీ
శ్వర యెక్కడ నడఁగె నీదువైభవ మెల్లన్. 68

సీ. రవి డాఁచి చూడంగ నవునట్టి నీమేన
నొదుఁగు మాలిన్యంబు గదిరియుండ
శత్రుభీకర మైన శాతాసి నమరునీ
కేల నీచపుబలికోల యుండ
లలితమకుటదీప్తిఁ బొలుచు నీశిరమున
శవసమర్పితమాల్యసమితి యుండ
విమలదివ్యాంబరావృతి నొప్పునీకటిఁ
గుత్సితం బగుబొంతకోక యుండఁ
జేసెనే దైవ మానతక్షితిపశేఖ
రప్రభాజాలసతతవిరాజమాన
చరణకమలసుందరహరిశ్చంద్ర సకల
బుధమనఃకైరవాకరపూర్ణచంద్ర. 69

క. విలసితమణిహర్మ్యస్థల
ములఁ దగ విహరించు నీకు భూతపిశాచా
కులశవధూపవృతాంబర
తల మగుప్రేతాలయంబు ధామం బయ్యెన్. 70

తే. అనుచు నత్యంతమోహశోకార్తి నొంది
నాథుమెడ వట్టికొని యేడ్చి నలినవదన
యకట కలయిట్లు నిక్కల యగునె యనుచుఁ
బనివె విభుఁ డెట్టికల గంటి పార్థివేంద్ర. 71

వ. అక్కలఫలం బిట్టిద యయ్యోనేని ధర్మసహాయత్వంబు లేదు గాక నిక్కంబును మనకు దేవబ్రాహ్మణప్రసాదం బును సత్యధర్మజ్ఞానానృశంస్యంబులును గలిగినయట్టిన నీయట్టిపరమధార్మి। కుండు రాజ్యపరిభ్రంశంబునొందియీ దురవస్థం బడునేయని దుఃఖిత యగు నద్దేవికి నన్నరపతి దనకన్నకల తెఱం గంతయు నెఱింగించి యయ్యింతి వలనం బుత్రమరణప్రకారం బెల్ల నేర్పడ విని నిట్టూ ర్పులు నిగుడ నత్యంతసంతాపాంతరంగుండై శైబ్య నాలోకించి వంశకరుండైన యీయొక్కశిశువును దైవ గతిం బోవ నగలకుం గొలు వగుచుఁ గుండంజాల వీని యొడలితోడన యనలంబునం బడియెద నన్నేలినచం డాలుని యనుజ్ఞ లేకున్న నింకొక్కపుట్టువున నైన వానికి బంట నయ్యెద నీదుర్మరణంబునం జేసి యనేక ఘోరనరకంబు లైనను ననుభవించెద దానయజనయా జనగురుపూజనంబు లొనరించినవాఁడ నైతినేని పరలో కంబుననైన మన మెప్పటియట్ల కూడి యుండెదము వినుము నగియును నే నెన్నండును బొంకుపలుక నా కిదియ నిశ్చయంబు నీకు ననుజ్ఞ యిచ్చితి నీ వరిగి యు ష్మహీదేవు దేవునింబోలె నారాధింపు మని పలికిన న పు డయ్యింతి కరం బళికి యిట్లనియె: 72

తే. కొడుకు నీవును జిచ్చునఁ బడఁగఁ జూచి
యేను జీవంబుతో నుందునే నరేంద్ర
నాకలోకసుఖం బైన నరక మైన
ననుభవింతును నీతోడ నరుగుదెంతు. 73

క. అనవుడు నొడఁబడి విభుఁ డిం
ధనములు సొదగా నొనర్చి దానిపయిఁ దనూ
జునినిడి భార్యయుఁ దనపిఱుఁ
దన నిలువం గేలుమొగిచి తత్పరమతి యై. 74



# 6 విష్ణుమాయానాటకము.

---o---

క. తగ "సర్వం విష్ణుమయం
జగత్త్" నుట వినవె యట్ల సర్వగతుఁడు స
త్యగరిష్ఠులకుం గనుపడుఁ
ద్రిగుణములై యందు నతని ప్రతిబింబంబుల్. 1

చ. త్రిగుణమయుండు గావునఁ బ్రదీప్తమగున్ వివిధప్రభాప్తిని
మ్మిగ నొకవేళ నొక్కయెడ మూఁటను నేర్పడియుండుఁ
గేవలుం। డగుపురుషుండు గావునఁ గ్రియాపరతంత్రుఁడు
గావునన్ సమ। స్తగుణవిలాసమూర్తులఁ బ్రసక్తివహించి
నటించు నొక్కచోన్. 2

వ. అని సర్వంబునుం దేటపడఁ బరాశరనందనుండు పలి
కిన ధర్మనందనుండు విని మహాత్మా! మీహృదయంగ
మ ప్రమాణవాక్యంబుల నాసందేహనివృత్తి యయ్యె.
అట్టివాఁడ యా నయిన నింక నొక్కటి యడిగెద న
ప్పుడు పురుషోత్తముండు నిజతేజంబు డాఁచి మాయా
మానుషధారియై జగంబులు నడుపుచుండఁ దద్వ్యాలస
నం బెట్టిదియునుం గానక భ్రమసి తిరుగు మముబోం
ట్లు తుదిముట్ట నెఱింగి ముక్తివడయఁజాలరు గాక, విజ్ఞా
నదృష్టిఁ బెక్కుతెఱంగుల నతని మొదలితేజంబుఁ దె

లిసి కృతకృత్యు లయినమీా రిట్లు తత్పరమసాయుజ్యం బుఁ బొందక యుండుటకుం గారణం బేమి యనిన న మ్ముని యి ట్లను: సకలంబును నతనిమాయావసితంబు తన్మాయాతిమిరంబు జగంబు లన్నియుఁ గప్పి సకలాజ్ఞా నాత్ములఁ గావించుచున్నయది. అది భేదింప నెవ్వరికి నలవిగాదు. దానం జేసి విష్ణుసాయుజ్యంబు దుర్లభంబు క్రమక్రమంబున నతనియందు భక్తియెక్కించిన పరమ భాగవతులకు సిద్ధించు; నహంకారపరు లయినవారు మాయాచక్రంబునఁ బరిభ్రమింతురు. వీరు వా రనవ లదు. సకలజనులును బ్రశాంతిభావశౌర్యవిద్యాప్రభా వంబుల నహంకరించుచుందురు గావున ముక్తిఁబడ యనోపరు. సాత్త్వికగుణంబు గలిగి యతని నెఱుంగరు. ఎఱుంగుట యరిది. యహంకారగ్రంథులై విష్ణుమా యఁ దిరస్కరించి బ్రహ్మరుద్రాదులు మోసపోయిరి. మేమెంతవార మది యె ట్లంటేని నే నెఱింగినకథలు సెప్పెద విను మని పలుకుసమయంబున: 3

ఉ. ద్వారకనుండి వచ్చె నటువర్యుఁ డొకండు వినీలకంధరా
కారుఁడు గోపిచందనవికస్వరఫాలుఁడు పారిజాతమా
లారమణీయవక్షుఁడు మిళత్తులసీవనమంజరీ శ్రవో
హారి ద్వితీయకృష్ణుఁ డన హాటకపుస్తకహస్తుఁడై దివిన్.

క. సనకసనందననారద
సనత్కుమారులును వానిసంగతిఁ బిఱుఁదం
జనుదెంచిరి తత్తనుది
వ్యనితాంతద్యుతులు పర్వెఁ బతిఁగొలు వెల్లన్. 5

ఉ. వాసవనీలజాలము లవారణరాలెడు మింటనుండి యు
ద్భాసితలీల వానిపిఱుఁద న్నవపంకజరాగరత్నముల్లా
సముదాయముం దొరగెఁ గన్గొనుఁడంచువటూత్తమాంబుజా
తాసనజాంగదీధితుల కచ్చెరువందిరి సభ్యులందఱున్.

వ. ఇట్లు గొలువువా రెల్ల నెద్దియు నిశ్చయింపనేరక తత్ప్ర భాపటలంబులు కన్నులు మిఱుమిట్లు గొలుపుచుఁ ద ద్భవనప్రదేశం బాచ్ఛాదింప సొంపారుచుఁ గొండొక ప్రొద్దు హర్షవిస్మయరసంబున నున్న యర్జునుండు గగన తలం బవలోకించి సాంద్రమహేంద్రనీలనీలాకారుం డొకఁ మహాబాహుండును సూర్యసంకాశు లయిన వారు మువ్వురునుఁ బూర్ణచంద్రోపమానుం డొకఁ రుండును నెవ్వరకో యని యెవ్వరో దివ్యపురుషులు వి జయంచేయుచున్నవా రని వెండియుఁ బ్రతీక్షించి యె ఱింగి తే నివ్వటుండు ద్వారకానగరంబువాఁడు కృష్ణుని యంతఃపురస్త్రీలకు రుక్మిణ్యాదులకు నుబుసుపోవం గ థలఁజెప్పు గోవిందశర్మ యనువాఁడు వీనియందు సత్య

భామామహాదేవి యనుగ్రహం బతిసమగ్రం బై యుం
డుఁ గడమ నలువురును సనకసనందనసనత్కుమారనార
దులును మీ రెఱింగినవారలు వారి రాకయు నివ్వేడ
కని తోఁచుచున్నయది యనినఁ గృష్ణద్వైపాయనుండు
నట్ల నిశ్చయించి గోవిందశర్మ యనువాఁడు మహాతప
స్వి సకలకథాప్రవీణుండు మన ముపక్రమించిన విష్ణు
మాయారహస్యంబు లన్నియు విశదంబుగాఁ జెప్పనేర్చి
నిక్కడికథాప్రసంగంబు తనదివ్యచిత్తంబున నెఱింగి
వాసుదేవుండె పంచినవాఁడు తదనుమతంబునఁ దద్దేవ
మునులు వానివాక్పాటవంబును దదీయమాయాప్రభా
వంబును విన వేడుకఁ జనుదెంచినా రని యందఱుఁ
గౌతూహలాయత్తతదభిమతాగమనప్రత్యుత్థానప్రయ
త్నాభిముఖు లగుచుండి రంత ననంతమార్గంబున డిగి
తత్సభాసమీపంబున నిలిచిన: 7

శా. పారాశర్యుఁడు దక్కఁ దక్కనమహాభాగుల్ సభాసీను ల
వ్వారాశిన్నమితోర్మిసంఘములరేవన్నిల్చుచున్ సంభ్రమం
బారం బానుజుఁడై నధర్మజుఁడు పేరిమాయత్తచిత్తంబుతో
వారిం దోడ్కొనివచ్చియిచ్చి కడువిశ్వాసంబుతో నచ్చనల్.

వ. తగువిధానంబుల నేవురం బూజించి సత్యవతీసుతుని
సమీపంబున నబ్బాలు నగ్రభాగంబునం గూర్చున్న

తక్కనలువుర సుఖాసీనులం గావించి తదనుమతంబున
గూర్చుండు సమయంబున: 9

సీ. కశ్యపకణ్వమార్కండేయభృగు వసి
ష్ఠమతంగజాబాలిజహ్నుపులహ
వాలఖిల్యాగస్త్యగాలవమైత్రేయ
జమదగ్నినారదశంఖకర్ణ
కపిలభరద్వాజగౌతమచ్యవన వి
శ్వామిత్రమౌద్గల్యచండదమన
రౌమహర్షణి శైల జైమునిమాండవ్య
వరతంతుశరభంగవత్సకౌత్సు
లాదిగాఁ గలపరమసంయములు వచ్చి
రందు గోవిందశర్మ ధర్మాత్మజునకు
విష్ణుమాయాప్రభావంబు విస్తరించు
ధీరమతి యంచు విజ్ఞానదృష్టి నెఱిఁగి.

వ. అట్లు సరిత్సాగరపర్వతారణ్యమధ్యంబున నున్నవార
లు దిక్పాలభరితబ్రహ్మలోకవాసంలును దండోపతండం
బులై పాటలితజటాభారదండకమండలుదర్భసూత్రా
క్షమాలికావల్కలాజినప్రముఖలాంఛనములతో నా
రాయణనామోచ్చారణపరాయణు లగుచు వచ్చిద్వా
రప్రదేశంబునం దుండిన. 11

క. కని దౌవారికముఖ్యుఁడు
వినయాంజలితోడ వచ్చి విన్నప మొనరిం
చిన విని కృష్ణద్వైపా
యనుఁ డుప్పొంగంగ నృపతి యతులప్రీతిన్. 12

క. అనుజులు దాను సంభ్రమ
మున నెదురుగఁ బోయి వినుతిపూర్వకముగ స
ద్వినయమున నమ్మునీంద్రులఁ
గొనిచని యర్చించి యునిచెఁ గుశపీఠములన్. 13

వ. తదనంతరంబ వారల యాశీర్వాదంబులతో సోదరా
మాత్యపరివృతుండై సిద్ధమంత్రతంత్రంబులసన్నిధిసిద్ధ
పురుషుఁడునుంబోలె నొప్పుచుండె నపుడు. 14

క. అందఱు సముచితపూజా
నందితులై యున్నఁ బలికె నారదుఁడు జనా
నందకరు ధర్మనందనుఁ
జందురునం దమృతరసము జాఱెడుభంగిన్. 15

ఉ. గొంతికి ధర్మదేవతకుఁ గూరిమిఁబుట్టిన పుణ్యమూర్తి వ
త్యంతదయావిధేయుఁడవు తాపసముఖ్యులునీగృహంబున
న్సంతసముంబ్రియార్చనలసంతసమంనుచునున్న వారు నీ
యంతటిభాగ్యవంతుఁడరయ న్మఱిలేఁడుజగత్త్రయంబునన్.

గీ. దేవ గంధర్వ యక్ష దైతేయరాజ
సభలు చూచితి నవియు నీసభకు సాటి

గావు సురరాజసభ యేమొ కాని కొంత
ధార్మికశ్రేష్ఠ సంపూర్త ధర్మతనయ. 17

సీ. వాసవదహనాంతకాసురవరుణమ
రుద్యక్షనాయకరుద్రపూజ్యు
.... .... .... .... ....
లనుచరభూతగుహ్యకసిద్ధగంధర్వు
లమితశాపానుగ్రహప్రభావులు హరి
హరహేమగర్భాదు లఖిలవేద
శాస్త్రోపనిషదర్థసన్మంత్రదక్షులు
కల్పాంతకస్థు లనల్పమతులు
సత్యసంధులు తత్త్వనిష్ఠాగరిష్ఠు
లిట్టిమును లిట్టినీయింటి కేగుదెంచి
పూజ లందుచునున్న నీపుణ్యఫలము
తత్ఫలము నీకు హరిసూవె ధర్మతనయ. 18

సీ. సకలలోకాధినాయకుఁ డాదిపురుషుండు
త్రైలోక్యరక్షావిశాలబుద్ధి
శ్రీకృష్ణుఁ డనుపేరఁ జెవులకుఁ జల్లగా
భువి దేవకీదేవి కవతరించి
యనుఁగుముద్దులబిడ్డఁ డగుచు నందయశోద
లకు నిహపరసౌఖ్యలక్ష్మి యొసఁగెఁ

గంసాదిరాక్షసకౌరవ్యముఖపాప
కారులఁ ద్రుంచి భూభార మణఁచె
వెలయ నక్రూరు ముచుకుందవిభుఁ గుచేలు
భీష్మ విదురుని మిమ్ము సంప్రీతి మనిచె
వెండియును నాపయోజనేత్రుండు మిమ్ముఁ
గూడి వర్తించుఁ బాయనినీడవోలె. 19

వ. అని నారదుండు పలికినట్లయౌ నని యశేషమహర్షి సంఘంబును సవిశేషభాషణంబుల ధర్మనందను భూషించిన నాశేషపన్నగసహస్రముఖనిర్ఘోషంబు ననుకరించెఁ దదనంతరంబున సనత్కుమారుండు తమయందఱ నడుమ నుత్కృష్టతేజోభిరాముండై గ్రహమండలమధ్యంబున బాలభానుంబోలెఁ బ్రకాశించుచుఁ బ్రతిభావిశేషంబున సభానందకందళంబై యున్నగోవిందశర్మను జూచి ధర్మనందనున కిట్లనియె.

ఉ. ఈవటుచక్రవర్తి హరి కిష్టసఖుండు సమస్తశాస్త్రగా
థావిదుఁ డాత్మవేది సతతంబును నవ్విభురాణివాసముః
భావము పల్లవింప బహుభంగుల మెచ్చఁగనెప్డుసత్కథల్
శ్రీ వెలయ న్ప్రహాస్యకృతలీలలమిక్కిలిఁబ్రస్తుతించుచున్.

వ. ఇది యెఱింగి వినువేడుక మేము నలువురము ను శ్వేతద్వీపంబున నుండి ద్వారకానగరంబునకు వచ్చి యచ్యుతునిచేత బహుమానంబు వడసి. 22

గీ కృష్ణ నీవిచిత్ర కేళివర్తనములు
గథలు జేసెనఁట ప్రగల్భబుద్ధిఁ
గూర్మి నీసఖుండు గోవిందశర్మ మా
కది వినంగవలయు నాదరమున. 23

వ. అనిన మందస్మితవదనారవిందుండై నందకపాణి గోవిందశర్మం జూచి నామీఁదిసౌహార్దంబునం జెప్పినకథ లన్నియు మత్ప్రియబాంధవుం డైనపాండవేయాగ్రణియు నిపుడుకరివగరంబున నిండుఁగొలువుండి వ్యాసభట్టారకుం డచటికిఁ జనుదెంచిన నతనితో నన్నుఁ బ్రసంగించి నామీఁదివాత్సల్యంబునఁ బ్రసంగవశంబున హరి మాయా కేళిచరిత్రంబులు విన వేడుకయయ్యెను,గొన్ని జెప్పుం డని యడిగిన నమ్ముని యేమేనియుఁ జెప్ప నుపక్రమించినాఁడు. నీ విమ్మునులఁ దోకొని యక్కడికి నరిగి యారాజునకుఁ బ్రియంబుగాఁ జెప్పు పొమ్మని యానతిచ్చి వీడ్కొలిపిన వచ్చితిమి. ఇక్కడి కథాప్రసంగంబు నట్లనే యున్నయది. అతనిసర్వాంతర్యామిత్వంబుఁ బ్రసంగింప నరిది, యింక నితని నీవుప్రార్థించి మాహృదయంబు ముదంబును బొంద నిమ్మునిబృందంబునకుఁ గర్ణానందంబుగా నడిగి విను మనిన సంతసించి కృతార్థుండ నైతి నని హరిదయావిశేషంబుం దలంచి

పులకించి సత్యవతీసుతుని యనుజ్ఞ వడసి ధర్మపుత్త్రుం డి
ట్లనియె. 24

గీ. అనఘ భూసురతనయ గుణాభిరామ
యచ్యుతునియట్ల నీవు మా కరసిచూడ
నీదువృత్తాంత మంతయు నెలమితోడ
నాకు నెఱిఁగింపు మున్న వినంగవలయు. 25

క. అహితల్పునకుం దక్కను
మహితోజ్జ్వలపారిజాతమాల్య మొరునకు
న్నహిఁ దాల్పరాదు నీకున్
వహింప నెట్లోదవెఁ జెపుమ వటుకులతిలకా. 26

మ. అనినన్ సంతసమంది యానృపతి యత్యాశ్చర్యముం
బొంది క। న్గొనఁ గర్ణామృతవాక్పరంపరల నాగోవింద
శర్ముండు మ।న్ననఁ జూడుం డని యమ్మహామునులకున్
హస్తాబ్జముల్ మోడ్చి ప। ల్కెనితాంతప్రియగోపకాం
తమురళీగీతప్రబంధధ్వనిన్. 27

సీ. ఘనుఁడు సాందీపుఁడు ననెడువిద్వాంసుండు
రామకృష్ణులకు గారాపుగురువు
లామహాభాగునియగ్రపుత్త్రుం డైన
ధర్మశీలునకు నందనుఁడ నేను
నాజన్మవేళ నందకపాణి వినుచుండ
నాకాశవాణి వీఁ డఖలశాస్త్ర

వేది యత్యాశ్రమవిశ్రుతకీర్తి గో
విందశర్ముఁడు గోవిందమిత్రుఁ
డనుచుఁ బలికెఁ బల్కువట్లన బ్రహ్మచ
ర్యాశ్రమంబుఁ జదువు నలరియుండ
మైత్రిఁ గృష్ణునగరు మరఁగి వర్తింతు గో
విందశర్మ యనఁగ వెలయువాఁడ. 28

క. చెప్పెదుఁ గ్రొత్తలుగాఁ గథ
లప్పద్మదళాయతాక్షునబ్జాక్షులకుం
జొప్పడ నంతఃపురిలో
నెప్పుడుఁ దత్కేలికలన లేర్పడి యుండున్. 29

వ. మఱియుఁ బూవుదండ వచ్చినప్రకారంబునుం జెప్పెద
నాకర్ణింపుము: 30

ఉ. ఆరయ సత్యభామహృదయం బెటు లుండునో యంచు
మాయ వి। స్తారముచేసి శౌరి ప్రమదంబున రుక్మిణియా
దియైనపం। కేరుహపత్రలోచనల కేలివనంబుల నొక్క
టొక్క టే। పారఁగఁ బారిజాతనివహంబుల నిల్పె స
మర్థ మేర్పడన్. 31

గీ. అష్టమహిషులయిండ్ల సహస్రసంఖ్య
లైనగోపాంగనలయిండ్ల నందఱకును
నన్నిరూపంబులై కేలి నలరె విభుఁడు

పారిజాతప్రసూనసౌభాగ్యలీల. 32

క. ఇందీవరదళలోచన
లందఱుఁ దన్నాయ యెఱుఁగ కబ్జాక్షుఁడు నా
యం దనురక్తుం డని యిం
పొంది సదాసక్తు లగుచు నుండిరి ప్రేమన్. 33

వ. ఇవ్విధంబున నయ్యనంతుం డనంతరూపవిలాసంబుల ద
క్షిణనాయకత్వం బవలంబించి యందఱియెడల మనో
వాక్కాయకర్మవిలాసకేళికల నొక్కచందంబుగా మెలంగు
చున్న నంత నొక్కనాఁడు: 34

చ. దళముగ గాఢయౌవనమదంబునఁ బైకొని చంద్రపా
దనిర్మలకలధౌతసౌధమణిమండపకోమలపుష్పడోలి
కాతలమునఁ బద్మలోచనుఁడుఁ దాను రమించుచు సత్య
భామ తాఁ దలఁచె మదీయకేలికి నితండె ప్రియుం
డని నెమ్మనమ్మునన్. 35

వ. ఇట్లు తలంచి యనురాగంబుం బెంచి: 36

క. తిలకించుచుఁ బులకించుచుఁ,
గలుషించుచు నగుచు విభునికౌఁగిటఁ గోర్కుల్
నెలకొలిపెఁ గబరిభారో
ద్గళితోత్కటపారిజాతగంధం బెసఁగన్. 37

క. చనుదెంచి వికచపంకజ
వనబంధసుగంధసురభివాసితయై యిం

పొనరించు కేలిదీర్ఘిక
ననువున మజ్జన మొనర్చి నభిమతలీలన్. 38

వ. కనకపీతాంబరంబులు ధరియించి తత్తీరపారిజాత ప్రసూనంబులు మనోహరమయంబులు గా నలంకరించుకొని పుష్పాడి యలఁది మధురసంబులు గ్రోలి యానంద లహరిఁ దేలియాడుచుఁ దదంతికచంద్రోపల వేదికామధ్యంబునఁ బుష్పాస్తరణంబునఁ గూర్చుండి చంద్రికాశీతలం బగు మందపవన కందళంబులచేత ఖేదంబపనయించుచుండి రప్పుడమ్మహాదేవి తనమనంబున: 39

శా. నాతోఁ గూడి విభుండు సంతసము నున్నాఁ డిట్లు
ప్రేమోల్లస। చ్చేతో మోద మెలర్ప దీనికి మదిన్ సిగ్గైన
నెట్లున్న వా। రో తర్కింపగఁ రుక్మిణీముఖవరారోహాదులు
ద్వ్యోగముం। జూతామంచు దరస్మితాంశుకలనానుస్మే
రవక్త్రాబ్జ యై. 40

గీ. ఇంగితాకారచేష్ట లెఱింగి మనసు
లోన మెలఁగెడు సతుల గారానఁ బిలిచి
యాసురద్రుమకుసుమచయంబుఁ గొంత
యేర్చి కోయించి వేర్వేఱ నేర్పరించి. 41

గీ. దివ్యమాణిక్యపాత్రిక లైచ్చి యిడిన
తత్ప్రసూనంబు లన్నియుఁ దగినకొలఁది

నోలిఁ బెట్టించి యి ట్లనె నొక తెతోడ
నలిననేత్రుండు తనలోన నవ్వుచుండ. 42

క. ఈపూలు గొన్ని రుక్మిణి
కేపారుకడంకతోడ నిచ్చి తదీయ
వ్యాపారముఁ దలఁపుము గని
రా పొ మ్మని యానతిచ్చె రాజస మొప్పన్. 43

వ. అప్పుడు. 44

చ. సురతరులాభగర్వమును శోభనయౌవనగర్వము న్మనో
హరనవరూపగర్వము నసంగవిహారవికారగర్వముం
బరమహితాత్ముఁడై విభుఁడు పాయనిగర్వము సత్యభా
మకున్ సరిపువుఁబోండ్లలోనఁ గడుఁ జాఁగుటకుం మదిఁ
బొంగి రచ్చెలుల్. 45

వ. అట్లు పారిజాతప్రసూనదానవ్యాజంబున రుక్మిణ్యాదులకు దన మహారాజసంబును బ్రాణేశ్వరుతోడఁ గూడి యనుభవించు మదనసామ్రాజ్యవైభవంబును హృదయశల్యంబై యుండవలయు నని కాదే ననుబోంట్లఁ బంపుట యని యాసంచారికారత్నంబు తన్మనఃప్రసాదంబును నెఱింగి చూచిన పుష్పమాలికఁ బుచ్చుకొని రుక్మిణీదేవి నగరికిం జనియెఁ గడమసతులయిండ్లకు నల్లన యా దేవి నియోగించిన సఖీజనంబులుఁ బోయి రటమున్న

పోయినయది రుక్మిణీదేవి కేలిభవనద్వారంబు ప్రవేశిం
చినఁ దద్వారపాలాంగన వాకిటి కడ్డంబు వచ్చి నిలిచి
దానితో ని ట్లనియె. 46

క. ఏకాంతంబున దేవియు
శ్రీకాంతుఁడు నున్నవారు చిత్తజకలనా
వ్యాకులితేంద్రియు లై తమ
లోకంబునఁ బోవఁ దరమె లోనికి నీకున్. 47

క. ఇవ్విరు లెవ్వరు పంపిరి
యెవ్వరిచెలి వనిత నవ్వి యెఱుఁగవె యిన్నా
ళ్ళివ్విరు లెవ్వరిసిగఁ గల
వవ్వారిజనేత్ర నగరియతివలలో నన్. 48

వ. లేనియేకాంతంబు గల్పించెదు. పూవు లెవ్వరుపంపి
రెవ్వరిదాన వని నన్ను నిరసించి పలికెదు. పారిజాత
ప్రసూనసౌరభ్యసౌభాగ్యంబు దేవేంద్రునినందనవనంబు
చూఱవట్టించి తెచ్చిన వీరపత్నీతిలకం బగుసత్యభామ
కుం దక్కఁ దక్కినయీనగరిమగువలకుం గలుగనేర్చు
నె యని గద్దించి పలికిన నవ్వేలంది న వ్వాలయు ని
ట్లనియె. 49

గీ. పారిజాత మేమి ప్రాతి యిందఱయిండ్ల
నుండఁ జూడవే పయోజనేత్ర